శ్రీః

శ్రీసదాశివబ్రహ్మేన్ద్రసరస్వతీస్వామినా విరచితః

# ఆత్మవిద్యావిలాసః

అనువాదము : శంకర కింకరుడు

ప్రతిపదార్థము : డా. ముళ్లపూడి విశ్వనాథశాస్త్రి



ప్రకాశకులు

**శ్రీమతి రావి కృష్ణకుమారీ, మోహనరావు దంపతులు**

510, Pride Block Platinum County, Opp: Hosanna Mandir,
Gorantla, GUNTUR ` 522 034. A.P. State

శ్రీః

శ్రీ సదాశివబ్రహ్మేన్ద్రసరస్వతీస్వామినా విరచితః

# ఆత్మవిద్యావిలాసః

**అనువాదము : శంకర కింకరుడు**

**ప్రతిపదార్థము : డా. ముళ్లపూడి విశ్వనాథశాస్త్రి**


ప్రథమముద్రణ : కార్తికపూర్ణిమ, 08-11-2022
ప్రతులు : 200
పుటలు : 120
వెల : అమూల్యము



© **R. Mohan Rao, M.Sc., M.A. (Sanskrit),**
510, Pride Block Platinum County,
Opp: Hosanna Mandir,
Gorantla, GUNTUR ` 522 034. A.P. State
**Cell : 9440115411**



**D.T.P. by :**
**P.PARVATHI**
**Cell : 74165 86775**

**Printed at :**
**Mohan Publications**
**Rajahmundry**



"మట్టి మొదలును వీడి – మన నడుమ
నిన్న మొన్నటివరకు నడయాడిన శంభుమూర్తికి
మౌనముద్రను వీడి – మహార్థముల నెన్నిటినో
ప్రవచించిన దక్షిణాస్య మహాదేవునకు
నేటికిని భక్తుల అంతరంగమున దోచి
"నీ ధర్మమును నీవేమి అనుసరించుచున్నావు?"
అని నిలదీసి అడుగుచున్న ఆచార్యమూర్తికి
శ్రీకంచికామకోటి పీఠాధీశ్వరులకు –
శ్రీశ్రీశ్రీ చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ యతీన్ద్రులకు
శంకర జయంతి సందర్భమున
భక్తితో దీనిని అర్పించుచున్నాము."

(మొదటి ముద్రణ నుండి)

శ్రీః

# శ్రీసదాశివబ్రహ్మేన్ద్రస్తుతి

"తాపత్రయార్త హృదయః
 తాపత్రయహార దక్షనమనమహమ్ ।
గురువర బోధితమహిమా
శరణం యాస్యే తవాఙ్ఘ్రి కమలయుగమ్ ॥

శబ్దార్థ విజ్ఞానయుతా హి లోకే
వసన్తి లోకా బహవః ప్రకామమ్ ।
నిష్ఠాయుతా న శ్రుతదృష్టపూర్వా
వినా భవన్తం యతిరాజమానమ్ ॥

స్తోకార్చనప్రీత హృదంబుజాయ
పాకాబ్జ చూడాపరరూపధర్త్రే ।
శోకాపహర్త్రే తరసా నతానాం
పాకాయ పుణ్యస్య నమో యతీశే! ॥

నాహం హృషీకాణి విజేతు మీశో
నాహం సపర్యా భజనాది కర్తుమ్ ।
నిసర్గయా త్వం దయయైవ పాహి
సదాశివేమం కరుణాపయోధే! ॥

– శ్రీశ్రీ జగద్గురు శృఙ్గగిరి
శ్రీ సచ్చిదానన్ద శివాభినవ నృసింహభారతి.

**శివాయ గురవే నమః**

# ముందుమాట

**"జన్తూనాం నరజన్మ దుర్లభమ్"** అని జగద్గురు ఆదిశంకరాచార్యస్వామి వారు **వివేకచూడామణి** అను గ్రన్థములో అన్నారు. ఎంతో పుణ్యము చేసికొంటే కాని మానవజన్మ లభించదు. అట్టి మానవజన్మను సద్వినియోగము చేసికొనుటకు ఆత్మజ్ఞానము సాధించుటయే ఏకైక మార్గము. ఆత్మజ్ఞానము వలననే పరమపురుషార్థమైన మోక్షము లభించును. ఇట్టి ఆత్మజ్ఞానమును బోధించుటకు శ్రీ ఆదిశంకరులు ఉపనిషద్భాష్యము, సూత్రభాష్యము, గీతాభాష్యము మొదలుగా కల అనేక గ్రన్థములను రచించిరి. అటుపిమ్మట దిగ్దన్తులైన పండితులు వేదాంతశాస్త్రమునకు సంబంధించిన అనేక వ్యాఖ్యానగ్రంథములను, వాదగ్రంథములను రచించిరి. ఈ రకముగా నున్న వేదాంతశాస్త్రము సామాన్యులకు దురవగాహముగా నుండుట గమనించి పరమహంస పరివ్రాజకాచార్యులు, జీవన్ముక్తులు అయిన శ్రీసదాశివబ్రహ్మేన్ద్రసరస్వతీస్వామి వారు అత్యంత సరళముగా వెనుక చెప్పబడిన గ్రంథముల సారాంశమును 66 శ్లోకములతో ఆత్మవిద్యావిలాసము అనుపేర రచించిరి. ఈ శ్లోకములన్నియు ఆర్యావృత్తములో కలవు.

శ్రీసదాశివ బ్రహ్మేన్ద్రసరస్వతీస్వామివారు క్రీ.శ. 1725 ప్రాంతమునకు సంబంధించిన వారు. ఆంధ్రప్రాంతమునకు సంబంధించిన వైదిక బ్రాహ్మణులు. వీరి గురువులు శ్రీపరమశివేంద్రసరస్వతీస్వామివారు.

ఆత్మవిద్యావిలాసము అను ఈ గ్రంథము చివరలో శ్రీస్వామివారు

**శ్లో॥ ఇతి గురుకరుణాపాఙ్గా-**
**దార్యాభిః ద్వ్యధికషష్టిసంఖ్యాభిః ।**

**నిరవద్యాభిరవోచం**
**నిగమశిరస్తన్త్రసారభూతార్థమ్ ॥**

అను శ్లోకములో వేదాన్తశాస్త్రసారమునంతటిని ఈ 62 శ్లోకములలో చెప్పితిని అని చెప్పారు. ఆ మాట సంపూర్ణముగా సత్యము.

ముక్తిని పొందదలచినవారు కఠినమైన బహుగ్రన్థపఠనము చేసి శ్రమ పడవలసిన పనిలేదు. శ్రీసదాశివబ్రహ్మేన్ద్రసరస్వతీస్వామి గురువరేణ్యుల యందు విశ్వాసముంచి ఆత్మవిద్యావిలాసమును నిత్యము పఠించుచు వారు చెప్పినట్లు ఆచరించిన చాలును అని నా దృఢవిశ్వాసము.

ఈ గ్రంథమునకు ప్రతిపదార్థము వ్రాయు అవకాశం నాకు కలిగించినందులకు మిత్రులు శ్రీరావి మోహనరావు గారికి నా కృతజ్ఞతలు. శ్రీ సదాశివబ్రహ్మేన్ద్ర-సరస్వతీస్వామి వారి కరుణాకటాక్షములు వారిపై సర్వదా ప్రసరించాలని స్వామివారిని మనఃపూర్వకముగా ప్రార్థించు చున్నాను.

**– ముళ్లపూడి విశ్వనాథశాస్త్రి.**

ఓం

శ్రీ గురుభ్యో నమః

శ్రీసదాశివబ్రహ్మేన్ద్రసరస్వతీ స్వామినా విరచితః

# ఆత్మవిద్యావిలాసః

శ్లో॥ వటతరునికటనివాసం
పటుతరవిజ్ఞానముద్రితకరాబ్జమ్ ।
కఞ్చన దేశికమాద్యం
కైవల్యానన్దకన్దలం వన్దే ॥ 1

శ్లో॥ నిరవధిసంసృతినీరధి-
నిపతితజనతారణస్ఫురన్నౌకామ్ ।
పరమతభేదనఘుటికాం
పరమశివేన్ద్రపాదుకాం నౌమి ॥ 2

శ్లో॥ దేశికపరమశివేన్ద్రా-
దేశవశోద్బుద్ధదివ్యమహిమాఽహమ్ ।
స్వాత్మని విశ్రాన్తికృతే
సరసం ప్రస్తౌమి కిఞ్చిదిదమ్ ॥ 3

శ్లో॥ నిరుపమ-నిత్య-నిరీహో
నిష్కల-నిర్మాయ-నిర్గుణాకారః ।
విగలితసర్వవికల్పః
శుద్ధో బుద్ధశ్చకాస్తి పరమాత్మా ॥ 4

శ్లో॥ స్వావిద్యైకనిబద్ధః
కుర్వన్ కర్మాణి ముహ్యమానస్సన్ ।
దైవాద్విధూతబన్ధః
స్వాత్మజ్ఞానాన్మునిర్జయతి ॥ 5

శ్లో॥ మాయావశేన సుప్తో
మధ్యే పశ్యన్ సహస్రశః స్వప్నాన్ ।
దేశికవచఃప్రబుద్ధో
దీవ్యత్యానన్దవారిధౌ కోఽపి ॥ 6

శ్లో॥ ప్రాకృతభావమపాస్య
స్వీకృతనిజరూపసచ్చిదానన్దః ।
గురువరకరుణాపాఙ్గాద్
గౌరవమాసాద్య మాద్యతి ప్రాజ్ఞః ॥ 7

శ్లో॥ శ్రీగురుకృపయా సచ్చి-
త్సుఖనిజరూపే నిమగ్నధీర్మౌనీ ।
విహరతి కశ్చిద్ విబుధః
శాన్తాహన్తో నితాన్తముదితాన్తః ॥ 8

శ్లో॥ గురువరకరుణాలహరీ-
వ్యతికరభరశీతలస్వాన్తః ।
విహరతి యతివర ఏకో
నిరుపమసుఖసీమని స్వైరమ్ ॥ 9

శ్లో॥ శ్రీదేశికవరకరుణా-
రవికరసముపోహితాన్తరధ్వాన్తః ।
విహరన్ మస్కరివర్యో
నిరవధికానన్దనీరధావాస్తే ॥ 10

శ్లో॥ జనివిపరీతక్రమతో
బుద్ధ్వా ప్రవిలాప్య పఞ్చభూతాని ।
పరిశిష్టమాత్మతత్త్వం
పశ్యన్నాస్తే మునిశ్శాన్తః ॥ 11

శ్లో॥ జగదఖిలమిదమసారం
మాయికమేవేతి మనసి మన్వానః ।
పర్యటతి పాటితాశః
ప్రగలితమదమానమత్సరః కోఽపి ॥ 12

శ్లో॥ నాత్మని కిఞ్చిన్మాయా
తత్కార్యం వాఽస్తి వస్తుతో విమలే ।
ఇతి నిశ్చయవానన్తః
హృష్యత్యానన్దనిర్భరో యోగీ ॥ 13

శ్లో॥ త్వమహమభిమానహీనో
మోదితనానాజనాచారః ।
విహరతి బాలవదేకో
విమలసుఖామ్భోనిధౌ మగ్నః ॥ 14

శ్లో॥ అవధూతకర్మజాలో
జడబధిరాన్ధోపమః కోఽపి ।
ఆత్మారామో యతిరా-
డటవీకోణేష్వటన్నాస్తే ॥ 15

శ్లో॥ శాన్త్యా దృఢోపగూఢః
శాన్తసమస్తాన్యవేదనోదారః ।
రమతే రసజ్ఞ ఏకో
రమ్యే స్వానన్దపర్యఙ్కే ॥ 16

శ్లో॥ ఉన్మూలితవిషయాలి(రి)ః
స్వీకృతవైరాగ్యసర్వస్వః ।
స్వాత్మానన్దమహిమ్ని
స్వారాజ్యేఽస్మిన్ విరాజతే యతిరాట్ ॥ 17

శ్లో॥ సవితర్యపి శీతరుచౌ
చన్ద్రే తీక్ష్ణేఽప్యధో వహత్యగ్నౌ ।
మాయికమిదమితి జానన్
జీవన్ముక్తో న విస్మయీ భవతి ॥ 18

శ్లో॥ అజ్ఞానవైరివిజయీ
ప్రజ్ఞామాతఙ్గమస్తకారూఢః ।
విహరతి సంయమిరాజః
సమరససుఖధామ్ని సర్వతో రమ్యే ॥ 19

శ్లో॥ శాన్తాహంకృతిదోషః
సుసమాహితమానసః కోఽపి ।
పూర్ణేన్దుశిశిరభావో
రాజత్యానన్దసత్యచిద్రసికః ॥ 20

శ్లో॥ తిష్ఠన్ పరత్ర ధామ్ని
స్వీయసుఖాస్వాదపరవశః కశ్చిత్ ।
క్వాపి ధ్యాయతి కుహచి-
ద్గాయతి కుత్రాపి నృత్యతి స్వైరమ్ ॥ 21

శ్లో॥ అగృహీతాఘకలఙ్కః
ప్రశమితసఙ్కల్పవిభ్రమః కోఽపి (ప్రాజ్ఞః) ।
న్యక్కృతకార్యకలాప-
స్తిష్ఠత్యాపూర్ణసీమని క్వాపి ॥ 22

శ్లో॥ చపలం మనఃకురఙ్గం
చారు గృహీత్వా విమర్శవాగురయా ।
నిగమారణ్యవిహారః
శ్రాన్తః శేతే స్వధామ్ని కోఽప్యేకః ॥ 23

శ్లో॥ దారుణచిత్తవ్యాఘ్రం
ధీరమనఃఖడ్గధారయా హత్వా ।
అభయారణ్యే కోఽపి
స్వైరవిహారీ జయత్యేకః ॥ 24

శ్లో॥ సజ్జనహృదయసరోజో-
న్మీలనకరధీకరప్రసరః ।
ఏకో యతివరపూషా
నిర్దోషశ్చరతి చిద్గగనే ॥ 25

శ్లో॥ కువలయవికాసకారణ-
మజ్ఞానధ్వాన్తకౌముదీప్రజ్ఞః ।
శుద్ధో మునీన్ద్రచన్ద్రః
సురసేవ్యే లసతి విష్ణుపదే ॥ 26

శ్లో॥ స్వానన్దామృతసేకైరాన్తర-
సన్తాపసన్తతిం శమయన్ ।
చిత్రమచఞ్చలవృత్తిశ్చి-
ద్వ్యోమని భాతి యోగివర్యఘనః ॥ 27

శ్లో॥ సుమనఃసౌరభమఞ్జుల-
సఞ్చారనివారితాఖిలశాన్తిః ।
సంయమిచారుసమీరో
విహరత్యానన్దసంవిదారామే ॥ 28

శ్లో॥ నిశ్శ్రేయససరసఫలే
నిర్మలవిజ్ఞానపల్లవమనోజ్ఞే ।
వీతభయే విపినతలే
యతిశితికణ్ఠో విభాతి కోఽప్యేకః ॥ 29

శ్లో॥ నిస్సారభువనమరుతల-
ముత్సార్యానన్దసారరసపూర్ణే ।
వరసరసి చిన్మయేఽస్మిన్
పరహంసః కోఽపి దీవ్యతి స్వైరమ్ ॥ 30

శ్లో॥ నిఖిలాగమపల్లవితే
నిగమశిరస్తన్త్రశీతలోద్యానే ।
మధురతరమఞ్జువాచః
కూజన్నాస్తే యతీన్ద్రకలకణ్ఠః ॥ 31

శ్లో॥ దారితమోహమదేభో
దూరీకృతసకలదురితశార్దూలః ।
విబుధోత్తమసింహవరో
విహరత్యానన్దవితతకాన్తారే ॥ 32

శ్లో॥ అజ్ఞానమృగవరోజ్ఝిత-
విజ్ఞానోత్తుఙ్గశృఙ్గశిఖరితలే ।
మతిసలిలశీతలాఙ్గో
యతివరకలభో విరాజతే విహరన్ ॥ 33

శ్లో॥ నాసాఞ్చలనిహితాక్షో
నామాదిభ్యో నివారితస్వాన్తః ।
తటినీతటేషు తత్త్వం
ధ్యాయన్నాస్తే యతిః కోఽపి ॥ 34

శ్లో॥ ఆశావసనో మౌనీ
నైరాశ్యాలఙ్కృతిః శాన్తః ।
కరతలభిక్షాపాత్ర-
స్తరుతలనిలయో మునిర్జయతి ॥ 35

శ్లో॥ విజననదీకుఞ్జగృహే
మఞ్జులపులినైకమఞ్జుతరతల్పే ।
శేతే కోఽపి యతీన్ద్రః
సమరససుఖబోధవస్తునిస్తన్ద్రః ॥ 36

శ్లో॥ భూతలమృదుతరశయ్యః
శీతలవాతైకచామరః శాన్తః ।
రాకాహిమకరదీపో
రాజతి యతిరాజశేఖరః కోఽపి ॥ 37

శ్లో॥ విపులశిలాతలఫలకే
విమలసరిద్వారిపరివృతోదారే ।
మన్దం మలయజపవనే
వాతి ప్రస్వపితి కోఽపి యతిరాజః ॥ 38

శ్లో॥ ఆన్తరమేకం కిఞ్చిత్
సన్తతమనుసన్దధన్మహామౌనీ ।
కరపుటభిక్షామశ్న-
న్నటతి హి వీథ్యా జడాకృతిః కోఽపి ॥ 39

శ్లో॥ ప్రవిలాప్య జగదశేషం
పరిశిష్టాఖణ్డవస్తుపరతన్త్రః ।
ప్రాశ్నాతి కబలమాస్యే
ప్రాప్తం ప్రారబ్ధకర్మణా కోఽపి ॥ 40

శ్లో॥ నిన్దతి కిమపి న యోగీ
నన్దతి నైవాపరం కిమప్యన్తః ।
చన్దనశీతలహృదయః
కన్దలితానన్దమన్థరః స్వాస్తే ॥ **41**

శ్లో॥ సన్త్యజ్య శాస్త్రజాలం
సంవ్యవహారం చ సర్వతస్త్యక్త్వా ।
ఆశ్రిత్య పూర్ణపదవీ-
మాస్తే నిష్కమ్పదీపవద్యోగీ ॥ **42**

శ్లో॥ తృణపఙ్కచర్చితాఙ్గ-
స్తృణమివ విశ్వం విలోకయన్ యోగీ ।
విహరతి రహసి వనాన్తే
విజరామరభూమ్ని విశ్రాన్తః ॥ **43**

శ్లో॥ పశ్యతి కిమపి న రూపం
న వదతి న శృణోతి కిఞ్చిదపి వచనమ్ ।
తిష్ఠతి నిరుపమభూమని
నిష్కామవలమ్బ్య కాష్ఠవద్యోగీ ॥ **44**

శ్లో॥ జాత్యభిమానవిహీనో
జన్తుషు సర్వత్ర పూర్ణతాం పశ్యన్ ।
గూఢం చరతి యతీన్ద్రో
మూఢవదఖిలాగమార్థతత్త్వజ్ఞః ॥ **45**

శ్లో॥ ఉపధాయ బాహుమూలం
పరిధాయాకాశమవనిమాస్తీర్య ।
ప్రస్వపితి విరతివనితాం
పరిరభ్యానన్దపరవశః కోఽపి ॥ **46**

శ్లో॥ గతభేదవాసనాభిః
స్వప్రజ్ఞోదారవారనారీభిః ।
రమతే సహ యతిరాజ-
స్త్రయ్యన్తాన్తఃపురే కోఽపి ॥ **47**

శ్లో॥ వైరాగ్యవిపులమార్గం
విజ్ఞానోద్దామదీపికోద్దీప్తమ్ ।
ఆరుహ్య తత్త్వహర్మ్యం
ముక్త్యా సహ మోదతే యతిరాట్ ॥ 48

శ్లో॥ విజనతలోత్పలమాలాం
వనితావైతృష్ణ్యకల్పవల్లీం చ ।
అవమానామృతఘుటికా-
మాత్మజ్ఞః కోఽపి గృహ్ణాతి ॥ 49

శ్లో॥ న నిషేధతి దోషధియా
గుణబుద్ధ్యా వా న కిఞ్చిదాదత్తే ।
ఆవిద్యకమఖిలమితి
జ్ఞాత్వోదాస్తే మునిః కోఽపి ॥ 50

శ్లో॥ భూతం కిమపి న మనుతే
భావి చ కిఞ్చిన్న చిన్తయత్యన్తః ।
పశ్యతి న పురోవర్త్యపి వస్తు
సమస్తార్థసమరసః కోఽపి ॥ 51

శ్లో॥ నిగృహీతాఖిలకరణో
నిర్మృష్టాశేషవిషయేహః ।
తృప్తిమనుత్తమసీమాం
ప్రాప్తః పర్యటతి కోఽపి యతివర్యః ॥ 52

శ్లో॥ సన్త్యజతి నోపపన్నం
నాసమ్పన్నం చ వాఞ్ఛతి క్వాపి ।
స్వస్థః శేతే యతిరా-
డాన్తరమానన్దమనుభవన్నేకః ॥ 53

శ్లో॥ కామపి విమలాం పదవీ-
మాసాద్యానన్దసంవిదున్నిద్రామ్ ।
ఆస్తే భిక్షుక ఏకో
విహరన్నిర్ముక్తబన్ధనః స్వైరమ్ ॥ 54

శ్లో॥ వస్తున్యస్తమితాఖిల-
విశ్వవిహారే విలీనమనాః ।
రాజతి పరానపేక్షో
రాజాఽఖిలవీతరాగాణామ్ ॥ 55

శ్లో॥ ఆచార్యాపాఙ్గదృశా
సమవాప్తాపారసంవిదాకారః ।
ప్రశమితసకలవిభేదః
పరహంసః కశ్చిదాభాతి ॥ 56

శ్లో॥ వర్ణాశ్రమవ్యవస్థా-
ముత్తీర్య విధూయ విధ్యాదీన్ ।
పరిశిష్యతే యతీన్ద్రః
పరిపూర్ణానన్దబోధమాత్రేణ ॥ 57

శ్లో॥ క్షయముపనీయ సమస్తం
కర్మ ప్రారబ్ధముపభుజ్య ।
ప్రవిగలతదేహబన్ధః
ప్రాజ్ఞో బ్రహ్మైవ కేవలం భవతి ॥ 58

శ్లో॥ స్తిమితమనన్తమనాద్యం
సన్తతమానన్దబోధఘనమ్ ।
అవికల్పమాద్యమేకం
సన్మాత్రం విద్యతే కిమపి ॥ 59

శ్లో॥ అక్షరమజరమజాతం
సూక్ష్మతరాపూర్వశుద్ధవిజ్ఞానమ్ ।
ప్రగళితసర్వక్లేశం
పరతత్త్వం వర్తతే కిమపి ॥ 60

శ్లో॥ సుఖతరమమరమదూరం
సారం సంసారవారిధేస్తీరమ్ ।
సమరసమభయమపారం
తత్కిఞ్చన విద్యతే తత్త్వమ్ ॥ 61

శ్లో॥ అరసమగన్ధమరూపం
విరజస్కమసత్త్వమతమస్కమ్ ।
నిరుపమనిర్భయతత్త్వం
సత్కిమపి ద్యోతతే నిత్యమ్ ॥ 62

శ్లో॥ ఇతి గురుకరుణాపాఙ్గా-
దార్యాభిః ద్వ్యధికషష్టిసంఖ్యాభిః ।
నిరవద్యాభిరవోచం
నిగమశిరస్తన్త్రసారభూతార్థమ్ ॥ 63

శ్లో॥ గదితమిమమాత్మవిద్యా-
విలాసమనువాసరం స్మరన్ విబుధః ।
పరిణతపరాత్మవిద్యః
ప్రపద్యతే సపది పరమార్థమ్ ॥ 64

శ్లో॥ పరమశివేన్ద్రశ్రీగురు-
శిష్యేణేత్థం సదాశివేన్ద్రేణ ।
రచితేయమాత్మవిద్యా-
విలాసనామ్నీ కృతిః పూర్ణా ॥ 65

పరమహంస పరివ్రాజకాచార్యులు
శ్రీపరమశివేంద్ర పూజ్యపాదుల శిష్యులు
అయిన, శ్రీసదాశివబ్రహ్మేంద్రులు
రచించిన ఆత్మవిద్యావిలాసము
సంపూర్ణము.

శ్రీః

ఓం

శ్రీ గురుభ్యో నమః

# ఆత్మవిద్యావిలాసము

అనువాదము : శంకర కింకరుడు

ప్రతిపదార్థము : డా. ముళ్లపూడి విశ్వనాథశాస్త్రి

**శ్లో॥ వటతరునికటనివాసం**
**పటుతరవిజ్ఞానముద్రితకరాబ్జమ్ ।**
**కఞ్చన దేశికమాద్యం**
**కైవల్యానన్దకన్దలం వన్దే ॥** 1

ప్ర : వటతరునికటనివాసమ్ = మఱ్ఱిచెట్టు మూలభాగమునందు నివసించువాడును,
పటుతరవిజ్ఞాన–ముద్రిత–కరాబ్జమ్ = బలమైన విజ్ఞానముద్ర కల హస్తపద్మము కలవాడును,
కైవల్యానన్దకన్దలమ్ = మోక్షానందమునకు అంకురము వంటివాడును,
కఞ్చన = ఒకానొక (వర్ణించుటకు అలవి కాని),
ఆద్యం దేశికమ్ = మొదటి గురువును (శ్రీ దక్షిణామూర్తి స్వామిని),
వన్దే = నమస్కరించుచున్నాను.

**తా॥** మఱ్ఱిచెట్టుకు చేరువగా జ్ఞానముద్రావిలసితమైన పాణిపద్మము గలవాడై – ఆదిముడైన గురువొకడు విరాజిల్లుచున్నాడు. కేవలానందమునకు మూలకందమైన ఆ గురువునకు ప్రణమిల్లుచున్నాను.

**వి :** సంసారమే ఒక మఱ్ఱిచెట్టు. ఊడలతో మఱ్ఱి విస్తరించును. సంసారమును అట్టిదే. మఱ్ఱివలె దాని విస్తృతికిని అంతములేదు.

'మఱ్ఱి' అనునది సంసారమును సూచించు చాటుమాట. దానికి చేరువగా నున్న గురువు పరమాత్మయే; పరబ్రహ్మమే! పరబ్రహ్మసన్నిధియందు మాయ ఈ విశ్వసృష్టిని సాగించు చున్నది.

"**మహామాయే విశ్వం భ్రమయసి పరబ్రహ్మమహిషి**" – సౌందర్యలహరి.

పరబ్రహ్మమో! దానికి ఒక చలనము లేదు. దాని యందొక వికారము జనింపదు. అది నిత్యసత్యవస్తువు. కేవలజ్ఞానానందములే దాని రూపము.

అందుచేతనే - జ్ఞానముద్రతో విలసిల్లు పాణిపద్మము గలవాడనియు - కేవలానందమునకు మూలకందమైన వాడనియు విశేషణములు వాడబడెను. అట్టి ఆ పరబ్రహ్మమును గురువుగా లక్షించి - వానిని జేరుకొని - అద్వయభావనతో మ్రొక్కిన వాడు విశ్వాతీతుడై ప్రకాశించును. '**అతడే తానై**' అలరారును.

మాయకు అవ్వలదోచు ఈ గురుమూర్తియే దక్షిణామూర్తి యని వినుతింపబడెను. 'దక్షిణము' అనగా మొదటిది. 'ఉత్తరము' అనగా తరువాతిది. మొదటిది పరమాత్మ. తరువాతిది ప్రకృతి, మాయ. మొదటిది మూర్తి యగుటచే ఆ పరమాత్మ దక్షిణామూర్తి.

జ్ఞానమే ఆయన రూపము. ఎచట నే జ్ఞానమున్నను అదెల్ల అటనుండి - ఆయననుండి వచ్చినదే! జ్ఞానదాతయే కదా గురువు. అందుచే ఆ దక్షిణామూర్తి ఆదిమగురుమూర్తి. ఆయన కేవలానందమునకు మూలకందమైనవాడు. '**ఆనన్దం బ్రహ్మేతి వ్యజానాత్**' - అని శ్రుతి పేర్కొనుచున్న విషయము యోగిజనులకు అనుభవసిద్ధమైనది.

ఇట్లు శ్రీసదాశివబ్రహ్మేంద్రసరస్వతులు - మాయా కార్యమైన ఈ విస్తృతసంసారమునకు మూలమందున్న జ్ఞానానందమయమైన పరబ్రహ్మమును పేర్కొని - దానిని గూర్చిన నమనమును - అభిముఖప్రవృత్తిని - ఫలితముగా అదే తానై యున్న ఏకత్వస్థితిని - నమస్క్రియారూపమున గ్రంథారంభమున వెల్లడించి యున్నారు.

గ్రంథము **ఆత్మవిద్యావిలాసము**. గ్రంథారంభమునందలి యీ మంగళాచరణశ్లోకము - గ్రంథములోని సర్వమైన విషయమునకును అద్దము పట్టుచుండుట విశేషము.

**శ్లో॥ నిరవధిసంసృతినీరధి-**
**నిపతితజనతారణస్ఫురన్నౌకామ్ ।**
**పరమతభేదనఘుటికాం**
**పరమశివేన్ద్రార్యపాదుకాం నౌమి ॥** 2

ప్ర : నిరవధి....న్నౌకామ్ :

నిరవధి = అంతులేని,
సంసృతి నీరధి = సంసార సముద్రము నందు,
నిపతిత = పడిన,
జన = జనులను,
తారణ = తీరమునకు చేర్చుటయందు,
స్ఫురత్ = భాసించుచున్న,

నౌకామ్ = నౌక వంటిదియును,
పరమతభేదనఘుటికామ్ = ఇతరమతములను ఖండించుటయందు
మాత్ర (ఔషధము) వంటిదియును, అగు;
పరమశివేన్ద్రార్యపాదుకామ్ = పరమశివేన్ద్రులు అను మా గురువు గారి
పూజ్యమైన పాదుకను,
నౌమి = నమస్కరించు చున్నాను.

**తా॥** పరమశివేన్ద్రశ్రీగురుపాదుక అపారమైన సంసారసముద్రమున బడి గిలగిలలాడుచున్న జనసందోహమును సముద్ధరించు నౌక. ఇతరమతముల నెల్ల జీల్చి చెండు దివ్యౌషధియైన ఆ శ్రీగురుపాదుకకు మ్రొక్కుచున్నాను.

**వి :** శ్రీ పరమశివేంద్రసరస్వతీమహాస్వామివారు కామకోటిపీఠము నధిష్ఠించిన జగద్గురువుల పరంపరకు చెందిన వారు. వీరి కాలమున (దాదాపు 200 సం.లు) నేటి కామకోటిపీఠము కుంభఘోణములో ఉండెడిది. ఈ స్వామివారు వేదవేదాంగములయందు ఘనతరవైదుష్యము కలవారగుటయే కాక గొప్ప రాజయోగులు. వీరు శ్రీసదాశివబ్రహ్మేంద్రసరస్వతులకు గురువులు.

తనను, మరెందరినో ఈ మాయమయసంసారసముద్రమునుండి సముద్ధరించి బ్రహ్మపదమును జేర్చి – చేర్చుచున్న ఆ గురువరుని పూజ్యపాదుకను గ్రంథారంభమున భక్తితో సంస్మరించి మ్రొక్కుచున్నాను.

పాదుక అనగా కాలి చెప్పు. (పద్యన్తే అనయా ఇతి పాదుకాః, పాదూరేవ పాదుకా.) శ్రీగురువుల కాలిచెప్పులు సైతము శిష్యులకు వంద్యములే కదా!

మరియు – '**పాలనాత్ దురితధ్వంసాత్ కామితార్థప్రపూరణాత్. పాదుకా నామ విఖ్యాతా**' ... ...

పాలనము – దురిత (పాప) నాశము – కామితార్థపూరణము అను మూడు పనులను ఆచరించునది అని తెలుపుటకు – ఆ మూడుపదముల ఆద్యక్షరములను జేర్చి '**పాదుక**' అనినారు – అన్నది వేరొక అర్థము. అపుడు పాదుక పరమశివేంద్రులకంటె వేరైనది కాదు. మరియు ఏకవచనము.

అనగా పాలించి – పాపములను బోగొట్టి – కామితములను బ్రసాదించు పరమశివేంద్ర శ్రీగురువులకు నమస్కారమని అర్థము.

కాగా పరమశివేంద్రుల రూపమున బ్రకాశించుచున్న పరబ్రహ్మమే ఇందు వినుతింప బడెను.

ఇట్లు దైవవందనము, గురువందనము లాచరించి శ్రీసదాశివయోగీంద్రులు స్వవిషయమును బ్రస్తావించుచున్నారు.

**శ్లో॥ దేశికపరమశివేన్ద్రా-**
**దేశవశోద్బుద్ధదివ్యమహిమాఽహమ్ ।**
**స్వాత్మని విశ్రాన్తికృతే**
**సరసం ప్రస్తౌమి కిఞ్చిదిదమ్ ॥ 3**

ప్ర: దేశిక = మా గురువు గారు అయిన,
పరమశివేన్ద్ర = పరమశివేన్ద్రులయొక్క
ఆదేశవశ = ఆజ్ఞానుసారముగా,
ఉద్బుద్ధ = మేల్కొన్న,
దివ్యమహిమా = దివ్యమైన మహిమలు కల,
అహమ్ = నేను,
స్వాత్మని = నాయొక్క ఆత్మయందు,
విశ్రాంతి-కృతే = విశ్రాంతిని పొందుటకై,
సరసమ్ = రసభరితమైన,
కిఞ్చిత్ = అనిర్వచనీయమైన,
ఇదమ్ = ఆ **ఆత్మవిద్యావిలాసము** అను గ్రంథమును,
ప్రస్తౌమి = ప్రస్తావించుచున్నాను.

**తా॥** సద్గురువులైన శ్రీపరమశివేంద్రుల ఆదేశముచే నాలో ఒకానొక దివ్యమైన మహత్త్వము మేలుకొన్నది. అందుచే స్వాత్మనిష్ఠుడనై ప్రకాశింపగోరి నేనిచట సరసముగా కొంచెము ప్రస్తావించుచున్నాను.

**వి :** గుర్వనుగ్రహములేక ఎవనికిని ఏమియును సిద్ధింపదు. తొలుత గురువు నందు - 'పరమాత్మ యీతడు' అన్న భావమును నిలిపి - దానిని విస్తరింప జేయుచు - '**సర్వం బ్రహ్మమయమ్**' అన్న అనుభవశిఖరమును జేరుకొనవలయును. ఇది దారి.

అట్లు కాక, ఎవడు, తనకు జ్ఞానదాతయైన గురువునందే పరమాత్మబుద్ధిని ('పరమాత్మ జ్ఞానాకృతి. ఆతడే శ్రీగురు రూపమున నన్ను అనుగ్రహించుచున్నాడు' నాలోని అజ్ఞాన తిమిరమును బారద్రోలుచున్నాడు అనెడి భావమును) నిలుపుకొనజాలడో - ఇక వాడేమి సాధించును?

అందువలననే – "**స గురుమేవాభిగచ్ఛేత్ సమిత్పుశఫలపాణిః**" అన్నది శ్రుతి. (పరమాత్మ నెఱుంగ గోరినవాడు – గురువునకు వలసిన పదార్థములు (సమిధలో – పండ్లో – దర్భలో) చేతబట్టుకొని పోయి గురువునే ఆశ్రయింపవలెను.

శ్రీసదాశివేంద్రులవారు తమ సాధనచే గురువును మించిన శిష్యులై ప్రకాశించినారు. అయినను ఆయన దృష్టిలో గురువే దైవము, గురువు తరువాతిదే దైవము. ఆ మహనీయుని గురుభక్తి నిరుపమానము.

నేను నాశక్తి సామర్థ్యముల బలముతో ఇంతవాడనైతినని వారు చెప్పుకొనలేదు. గుర్వనుగ్రహము నన్నింత వానిగ జేసినదన్నారు. లోకము వారి గురుభక్తిని ఆదర్శముగా తీసికొని తమ్ముదాము సరిదిద్దు కొనవలెను.

గోస్వామి తులసీదాసు శ్రీరామచరితమానస రచనము '**స్వాన్తస్సుఖాయ**' అయినట్లు – శ్రీసదాశివులు తమ యీ '**ఆత్మవిద్యావిలాసము**' 'స్వాత్మని విశ్రాన్తికృతే' (ఆత్మ పదార్థమున విశ్రాంతి ననుభవించుటకు అని చెప్పుకొనినారు.)

బ్రహ్మవిద్వరుడు బ్రహ్మానందమునకు దోహదకారులైన పనులను మాత్రమే ఆచరించును. **బ్రహ్మానందమే** గ్రంథప్రయోజనము.



ఇట్లు దేవతా – గురు – వందన – గ్రంథప్రయోజనములను బేర్కొని పరమాత్మ స్వరూపమును వివరించుచున్నారు.

**శ్లో॥ నిరుపమ–నిత్య–నిరీహో**
**నిష్కల–నిర్మాయ–నిర్గుణాకారః ।**
**విగలితసర్వవికల్పః**
**శుద్ధో బుద్ధశ్చకాస్తి పరమాత్మా ॥ 4**

ప్ర : నిరుపమ–నిత్య–నిరీహః = సాటిలేని వాడును, నిత్యమైన వాడును, ఏ కోరికలు లేనివాడును,
నిష్కలనిర్మాయనిర్గుణాకారః = అంశములు, మాయ, గుణములు, ఆకారము లేనివాడును,
విగళితసర్వవికల్పః = సమస్త భ్రాంతులు తొలగినవాడును,
శుద్ధః = ఏ మాలిన్యములు లేనివాడును,
బుద్ధః = జ్ఞానస్వరూపుడును అగు,
పరమాత్మా = పరమాత్మ,
చకాస్తి = భాసించుచున్నాడు.

**తా॥** సాటిలేనిదై – నిత్యమై – ఏ కోరికలును లేనిదై – అఖండమై – మాయారహితమై – నిర్గుణమై – సంకల్పవికల్పములు లేనిదై – శుద్ధమై – జ్ఞానమయమై పరమాత్మస్వరూపము విరాజిల్లుచున్నది.

**వి : సాటిలేనిది :** దేనికైనను పోలికను బేర్కొన వచ్చును గాని – పరమాత్మ స్వరూపమును గూర్చి 'ఇదం – ఇత్థం' (ఇది – ఇట్లు) అని తెలుపుట సాధ్యము కాదు. ఆత్మాభిన్నముగ నుండుటయే దీనికి గారణము. అందువలననే అది వాక్కులకు అందనిది (**యతో వాచో నివర్తన్తే**) అని శ్రుతి తెలుపుచున్నది.

**నిత్యము :** ఏ వస్తువైనను అది పుట్టుటకు ముందు ఉండదు. నశించిన పిమ్మట నిలిచి యుండ నేరదు. ఉత్పత్తికి లయమునకు నడిమి కాలమందే ఏవస్తువైనను భాసించుచున్నది. పరమాత్మకు ఉత్పత్తిలేదు. విలయము లేదు. అందుచే ఆతడు నిత్యుడు. ఆతడు కాలాతీతుడు.

**ఏ కోరికలు లేనిది :** శరీరధారులకు కోరిక లుండును. శరీరము – ఇంద్రియములు. మనసు, బుద్ధి – వీనియందలి తాదాత్మ్యము వలననే (ఇవే నేను అనుకొనుట వలననే) ఏ కోరిక యైనను జనించును. ఇట్టి తాదాత్మ్యము లేనిచోటనే పరమాత్మానుభవము సిద్ధించును. దేహేంద్రియతాదాత్మ్యము అంతరించినపుడు గాని పరమాత్మానుభవము కలుగదు. ఆ తాదాత్మ్యము తొలగినచోట కోరికలు ఉదయించుట కే అవకాశము లేదు. అందుచే పరమాత్మ 'నిరీహుడు' అనబడినాడు.

**అఖండము :** ఖండము అనగా ముక్క; భాగము. పరమాత్మ స్వరూపము అంతటను నిండియున్నది. దానిలో ఖండములకు భాగములకు అవకాశమే లేదు. అందుచే అది అఖండము.

**మాయారహితము :** సంసారము మాయావిలాసము. పరమాత్మ మాయాతీతుడు. మన ఇంద్రియములు – అంతఃకరణము ఇవన్నియు దాటిపోయిననే పరమాత్మోపలబ్ధి. అచట మాయ లేదు.

**నిర్గుణము :** సత్వగుణము – రజోగుణము – తమోగుణము అని గుణములు మూడు. మనయందీ మూడింటిలో నేదోయొకటి తలయెత్తి రాజ్యమేలు చుండును. ఒకపుడు సత్వగుణము; వేరొకపుడు రజోగుణము లేక తమోగుణము ఇటులేదో యొక గుణప్రకాశమునకు జిక్కి మనముందుము. ఈ త్రిగుణములును మాయాస్వరూపమే. అందుచేతనే మాయ '**త్రిగుణాత్మ**' అనబడెను. మాయారహితుడు కదా పరమాత్మ. అందువలన ఆయన నిర్గుణుడు.

**వికారములు లేనిది :** పుట్టుట – పెరుగుట మొదలగు వికారములు పరమాత్మయందు లేవు.

**శుద్ధము :** అన్యవస్తుసంపర్కము కొంచెమును లేనిదగుటచే పరమాత్మస్వరూపము శుద్ధము.

ఇట్టిదైన పరమాత్మ స్వరూపము సర్వత్ర సర్వదా విరాజిల్లుచున్నది. కాని గుర్వనుగ్రహము– లేక – తీవ్రసాధనలేక అది అనుభవమునకు అందదు.



**అవతారిక :** పరమాత్మ స్వరూపమును వివరించి – సంసారబద్ధుడైన జీవుని – సాధకుని – సిద్ధుని గూర్చి వివరించుచున్నాడు.

**శ్లో॥ స్వావిద్యైకనిబద్ధః**
**కుర్వన్ కర్మాణి ముహ్యమానస్సన్ ।**
**దైవాద్విధూతబన్ధః**
**స్వాత్మజ్ఞానాన్మునిర్జయతి ॥ 5**

ప్ర : స్వావిద్యైకనిబద్ధః = తన యొక్క అజ్ఞానము చేత మాత్రమే సంసారము నందు చిక్కుకొనిన వాడై,
కర్మాణి = నిత్య నైమిత్తికాది కర్మలను,
కుర్వన్ = చేయుచూ,
ముహ్యమాన స్సన్ = మోహములో పడుచూ,
దైవాత్ = అదృష్టవశమున,
స్వాత్మజ్ఞానాత్ = ఆత్మజ్ఞానముచే,
విధూతబన్ధః = ఆ బన్ధము నుండి విముక్తుడై,
మునిః = ముని,
జయతి = సర్వోత్కృష్టుడుగా విరాజిల్లుచున్నాడు.

**తా॥** తన అజ్ఞానమే తన్ను కట్టివేయగా మోహమగ్నుడై ఏవో కర్మలనాచరించుచు, సంస్మరించుచున్న జీవుడు – దైవానుగ్రహముచే అజ్ఞానపాశము విచ్ఛిన్నము కాగా – '**ఇదిగో! ఇదీ నేను**' అని అచ్ఛమైన తన రూపమె నెఱింగి అందు నిలిచిన వాడై (ఆత్మనిష్ఠుడై) మౌనియై విరాజిల్లుచున్నాడు.

**వి :** మాయాతీతుడు పరమాత్మ. మాయావశుడు జీవుడు. ఆవరించిన మాయను దొలగింపగా వాడే వీడు; వీడే వాడు.

అజ్ఞానమే బంధకారణము. అనగా తెలివిలేమి. లేనిది బంధమై ఎట్లు కట్టి వేయగలదు? కాగా బంధమన్నది కూడా వాస్తవమునకు లేనిదే!

'**బన్ధశ్చ – మోక్షశ్చ మృషైవ మూఢాః**' – వివేకచూడామణి.

(బంధమునుగూర్చి లేదు. మోక్షమున్నూ లేదు. రెండును అసత్యములే.)

బద్ధుడను అన్నది భ్రాంతి. ఆ భ్రాంతిని దొలగించుటకు మోక్షభ్రాంతిని కల్పించుట జరుగుచున్నది. దయ్యము పట్టినదని భ్రాంతుడైన వానికి – దయ్యము వదలినదన్న భ్రాంతిని గలిగింపవలెను. అపుడే వాడు స్వస్థుడగును. అటులే సంసారబద్ధుడనన్న భ్రాంతిలో నున్న వానిని స్వస్థునొనరించుటకు – ముక్తుడనైతిని. బంధము తొలగినదన్న భ్రాంతిని కలిగింప వలెను. ఇట్లు ఈ భ్రాంతిచే ఆ భ్రాంతి నెట్టివేయబడినపుడు స్వతస్సిద్ధమైన ఆత్మస్వరూపము ఎరుకకు అందును.

అయితే ఇదంత తేలిక కాదు. పరమాత్మ ఎవనిని అనుగ్రహించునో ఆతడు మాత్రమే అజ్ఞానమును త్రోసిరాజనుటకు పూనుకొనును. దైవానుగ్రహము లేనిచో – ఎంత చదివిన వాడైనను – ఈ లేనిదాని పట్టునుండి (మాయాబంధమునుండి) తప్పించుకొనజాలడు.

అందువలననే శ్రుతి '**యమేవైష వృణుతే**' – 'ఎవనిని పరమాత్మ వరించునో' – అన్నది.

తానెవరో ఎరుకకు అందినపుడు – అనుభవమునకు జిక్కినపుడు – ఇక మరి వాడు మాటాడడు. వాని యింద్రియములు విషయాసక్తములు కావు. మనసు తన చలనములను గోల్పోవును. అట్టి స్థితిలో వాడు మౌని కాక ఏమగును?

అవిద్యాపాశబద్ధుడు జీవుడు. దైవానుగ్రహముచే బంధచ్ఛేదమునకు ఉద్యుక్తుడైన వాడు సాధకుడు. ఆత్మజ్ఞానసంపన్నుడు సిద్ధుడైన ముని.



అజ్ఞాననిద్రామగ్నునకు గురూపదేశమే మేలుకొలుపు అనుచున్నారు.

**శ్లో॥ మాయావశేన సుప్తో**
**మధ్యే పశ్యన్ సహస్రశః స్వప్నాన్ ।**
**దేశికవచఃప్రబుద్ధో**
**దీవ్యత్యానన్దవారిధౌ కోఽపి ॥ 6**

ప్ర : మాయావశేన–సుప్తః = ఈశ్వరునియొక్క మాయా ప్రభావముచేత,
సుప్తః = నిద్రించినవాడై,
పునరపి = మరలకూడా,

సహస్రశః = వేలకొలదిగ,
స్వప్నాన్ = స్వప్నములను,
పశ్యన్ = చూచుచు,
దేశికవచః-ప్రబుద్ధః = ఆచార్యుని వాక్కులతో మేల్కొన్నవాడై,
ఆనన్దవారిధౌ = ఆనన్దసముద్రమునందు,
కోఽపి = ఒకానొకడు (జీవుడు),
దీవ్యతి = క్రీడించుచున్నాడు.

**తా॥** మాయకు జిక్కి నిద్రలోబడి - ఎన్నో కలలను గాంచుచు కలవరపడుచున్న వారిలో ఒకానొకడు శ్రీగురుని ఉపదేశముచే మేల్కొని ఆనందసాగరమున విహరింప గల్గుచున్నాడు.

**వి :** అనాత్మవస్తువునందు ఆత్మభావము - ఆత్మవస్తువునందు అనాత్మభావము నిద్ర. దీనికి కారణము మాయ.

దేహాదులు తాను కాదు. వానియందు తాను అన్న భావమును నిలుపుచున్నాడు. అనగా ఆత్మకాని దానిని ఆత్మ అనుకొనుచున్నాడు. ఇదియే '**అనాత్మని ఆత్మభావము**'.

నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తమై - '**న జాయతే మ్రియతే వా కదాచిత్, నాయం భూత్వా భవితా వా న భూయః**' అని కీర్తింపబడిన పరబ్రహ్మమే తానై యుండగా - దానిని విస్మరించి చరించుచున్నాడు. ఇది '**ఆత్మని అనాత్మభావము**'.

తన్నుదా మరచుట నిద్రాలక్షణమే కదా!

దేహాదులయందు తాదాత్మ్యము జెంది యున్న వానికి దారపుత్రాది రూపమైన స్వప్నము జనించుచున్నది. ఇది ఒక కలకాదు. ఎన్నో కలలు! వానియందు కలవరింతలు!

ఇది మాయావశుడైన వాని స్థితి.

ఇట్టి స్థితి యందుండియు - సత్సంగతిచే - సుకృతవిశేషముచే భాగ్యశాలియైన వానియందు దైవము గురురూపమున అనుగ్రహమును గనబరుచును.

'**తత్త్వమస్యాది**' మహావాక్యరూపమైన శ్రీగురుని ఉపదేశము వానిని ఈ నిద్రనుండి మేలుకొల్పును. ఆపు డాతడు - నశ్వర శరీరాదులకంటె విలక్షణమైన తన స్వరూపమును గుర్తించి ఆనందమగ్నుడై చరించును.

ఇది సంసారసాగరమగ్నులైయున్న వారిలో ఎక్కడనో ఎవనికో ఒకనికి లభించు భాగ్య విశేషము.



ఆత్మజ్ఞానసంపన్నులు కోటికొకరుందురేమో అని భావము. శ్రీగురుని కరుణకు బాత్రుడైన వాడేమిచేయునో నాలుగు శ్లోకములలో వివరించుచున్నారు.

**శ్లో॥ ప్రాకృతభావమపాస్య**
**స్వీకృతనిజరూపసచ్చిదానన్దః ।**
**గురువరకరుణాపాఙ్గాద్**
**గౌరవమాసాద్య మాద్యతి ప్రాజ్ఞః ॥ 7**

ప్ర : ప్రాజ్ఞః = వివేకము కలవాడు,
ప్రాకృతభావమ్ = దేహేన్ద్రియములే నేను అనెడి అజ్ఞానమును,
అపాస్య = విడిచిపెట్టి,
స్వీకృతనిజరూప-సచ్చిదానన్దః = సత్ చిత్ ఆనందములు అను తన స్వరూపములను తెలిసికొని వాటిని స్వీకరించి,
గురువరకరుణాపాంగాత్ = గురుదేవుల కరుణా కటాక్ష దృష్టివలన,
గౌరవమ్ = గొప్పదనమును,
ఆసాద్య = పొంది,
మాద్యతి = తృప్తిని పొందుచున్నాడు.

**తా॥** శ్రీగురుని కరుణకు బాత్రమై తెలివొందినవాడు ప్రాకృతభావమును అనగా ఈ శరీరము తానన్న జగద్భావమును పరిహరించును. సచ్చిదానందమయమైన స్వస్వరూపమును స్వీకరించి గౌరవోపేతుడై ఆనందమత్తుడై చరించును.

**వి :** శ్రీగురుని యుపదేశముచే ప్రథమమున 'ఏది తాను కాదో – అది తెలిసివచ్చును'. పిమ్మట తన స్వరూపము తెలివికి అందును.

ఆత్మజ్ఞానోపదేశమునకు బూనుకొన్న వేదాంతశాస్త్రములు ఇదే విధానమును అవలంబించి ప్రవర్తిల్లుచున్నవి. '**నేతి నేతి**' వాక్యములతో (న+ఇతి, న+ఇతి = ఇది కాదు, ఇది కాదు) అన్నిటిని త్రోసివేయగా ఏది త్రోసివేయుటకు వీలుకానిదై విరాజిల్లుచున్నదో – అది '**ఆత్మ**' అని అవి బోధించుచున్నవి.

ఇటులేల చేయవలయును? ఆత్మస్వరూపమునే వివరింపరాదా? అనవచ్చును.

ఆత్మస్వరూపము '**ఇదం – ఇత్థం**' అని వాక్కులతో వివరించుట వీలైనది కాదు. అందుచే వేదాంతములు ఇదే మార్గమును అవలంబించినవి. ఫలితముగా సాధకుడు తొలుత తాను ఏది కాదో – దానిని గుర్తించును. '**ఉపదేక్ష్యన్తి తేఽ జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః**' – అని గీత (తే+అజ్ఞానం).

పంచభూతాత్మకమైనది ప్రకృతి. దేహము పాంచభౌతికము. అందుచే అది ప్రాకృతము. సాధకుడు తొలుత ప్రాకృతమైన దేహాదికమును వివేచన చేసి, తనకంటే ఇదెల్ల వేరైనదిగా గుర్తించి, వానితోడి తాదాత్మ్యమును విడిచిపెట్టును.

పిమ్మట సర్వమును నెట్టివేయగా శేషించియున్న సచ్చిదానందమయమైన స్వరూపమే తానుగా గ్రహించును.

లోకమున 'సత్యము' అనగా నిజము చెప్పుట. కాని వేదాంతములయందు అట్లు కాదు. సత్యమనగా త్రికాలాబాధ్యమైనది. సత్యమన్నను సత్ అనినను ఒక్కటే. చిత్ – అనగా జ్ఞానము.

సచ్చిదానందమయమైన ఆత్మస్వరూపము జననమరణములు లేనిది. సుఖదుఃఖములు – కామక్రోధాదులు – దేహేంద్రియమనోబుద్ధులవరకు మాత్రమే వెంటాడగలవు. ఆత్మ వస్తువును అవి తాకలేవు. అది అచ్చముగా ఆనందపు ముద్ద. '**రసో వై సః**' – అని శ్రుతి.

ఇట్లు బహిరంతరములయందు వెలితి యున్నది. లేని ఆనందమే తన రూపముగా గ్రహించి అనుభవించుచున్నవాడు మత్తుడై చరింపడా?

శ్రీగురుని కరుణకు పాత్రమై హెచ్చరింపబడినవాడు మాత్రమే ఆనందమత్తుడై చరింప గలడు!

---

**శ్లో॥ శ్రీగురుకృపయా సచ్చి-**
**త్సుఖనిజరూపే నిమగ్నధీర్మౌనీ ।**
**విహరతి కశ్చిద్ విబుధః**
**శాన్తాహన్తో నితాన్తముదితాన్తః ॥ 8**

ప్ర : కశ్చిద్ = ఒకానొక,
విబుధః = పండితుడు,
శ్రీగురుకృపయా = గురుదేవుల అనుగ్రహముతో,
సత్–చిత్–సుఖ–నిజరూపే = సత్ చిత్ ఆనందము అనెడి తనరూపము నందు,
నిమగ్నధీః = లీనమైన బుద్ధి కలిగి,
మౌనీ = మౌనమును ఆశ్రయించి,
శాన్తాహన్తః = నేను అనెడి భావము లేనివాడై,
నితాన్త–ముదితాన్తః = తనలో తాను మిక్కిలి సంతసించినవాడై,
విహరతి = ఆనందముతో సంచరించును.

**తా॥** శ్రీగురుకరుణావిశేషముచే – సచ్చిత్సుఖాత్మకమైన ఆత్మస్వరూపమున నిమగ్నుడై – అహంభావము శాంతింపగా పెల్లుబికిన ఆనందముతో – ఎవడో ఒకానొక ప్రాజ్ఞుడు మౌనియై విహరించును.

**వి :** వెనుకటి శ్లోకమున ఆత్మస్వరూపమును సచ్చిదానందమయముగా స్వీకరించుట పేర్కొనబడెను.

ఇందు ఆత్మస్వరూపమున నిమగ్నుడై యుండుట వివరింపబడెను.

దేహాదులతో తాదాత్మ్యము చిరకాలమునుండి జన్మజన్మలనుండియు సాగి వచ్చుచున్నది. శ్రీగురుకరుణాప్తిచే ఇంచుక తెలివి ఉదయింపగా ఈ పరిస్థితి తారుమారగును.

ఇంతవరకు 'తానే' అని ఏ దేహాదికమును భావించుచు వచ్చినాడో అది తాను కాదని తోచసాగెను. ఇంతవరకు దేనినిగూర్చి బోధము తనకు కొంచెమును లేదో, ఏది ఎరుకకు (ఇదం ఇత్థం అని గ్రహించుటకు) అందదో అది తానని స్ఫురింపసాగెను.

అయినను చిరకాలమునుండియు సాగివచ్చుచున్న ప్రవృత్తి ఒక్కసారిగా మాసిపోదు. అది అనువర్తించుచునే యుండును. ఆ దశలో 'దేహాదులయందు' – 'నేనుకాదు' అన్న భావమును – 'దేహాదులకంటె విలక్షణమైన సచ్చిదానందస్వరూపమున ఆత్మభావమును' ప్రయత్నపూర్వకముగా నిలువబెట్టుకొనుచుండవలయును. అయినను అది జారిపోవు చుండును. జారిపోయి – దేహాదులయందే తానన్న భావము స్వయంప్రతిష్ఠితమగు చుండును. అపుడు సాధకునకు పునఃపునః ప్రయత్నము అవసరమగును. అందుచేతనే వెనుకటి శ్లోకమున – '**స్వీకృతనిజరూపసచ్చిదానన్దః**' – అనినారు.

ఇట్లు సాధకుడు ప్రయత్నపూర్వకముగా ఆత్మనిష్ఠుడై యుండుటకు అభ్యాసము సాగింపగా – వానికి ఆత్మనిష్ఠతో బాటు, దేహాదులయందు అనాత్మభావము సహజసిద్ధమై పోవును. అట్టి స్థితి చేకూరగా – ఆతడు సచ్చిత్సుఖాత్మకమైన ఆత్మస్వరూపమున నిమగ్ను డగును. మునుగును. ఫలితముగా వానియందలి అహంభావము నీరుచల్లిన నిప్పై పోవును.

ఇంతవరకును – ఎవరైనను తనదేహాదులకు నొప్పి కలిగింపగా – 'నన్ను వాడిట్లు చేసెను. నేను ఊరకొందునా?' – ఇత్యాదిగా అహంభావము (నేను అనెడి భావము) త్రాచువలె చఱ్ఱున తల ఎత్తుచుండును.

ఇపుడు దేహాదులు తాను కాదన్న భావము బలపడి నందున – ఎన్ని అపకారములు జరిగినను లేదా ఉపకారములు జరిగినను 'నేను' అన్న భావము – ప్రతీకారభావము – తల ఎత్తవు.

ఫలితముగా అచ్ఛమైన ఆనందము కట్ట తెగిన మహాప్రవాహమువలె పెల్లుబికి అంతరంగమును ఆప్లావిత మొనర్చును.

ఒక మహాప్రవాహమున్నది. దానికి ఒక కొండ అడ్డ మున్నది. అపుడా ప్రవాహముతో మనకు సంబంధము విచ్ఛిన్న మగును.

ఒకానొక భాగ్యవంతమైన కాలమున ఆ కొండను పూర్తిగా తొలగించుట సంభవించి నపుడు – ఆ ప్రవాహము ఉరకలు పెట్టదా?

హనుమంతుడు సీతమ్మను దర్శించి, రాక్షసులను సంహరించి, లంకను గాల్చి – మరల జానకీదేవిని జూచి, శ్రీరాముని దర్శింపవలయునని త్వరపడుచు (రామదర్శనశీఘ్రేణ) అరిష్టము అను కొండనెక్కెను. ఆ కొండ ముప్పది యోజనముల నిడివి పది యోజనముల విస్తారమును గల్గి యున్నది. ఉత్సాహభరితుడైన హనుమ ఆ కొండపై నెక్కి, ఊగి ఊగి తన సహచరులను చేరుకొనుటకై ఒక్కదూకు దూకెను. అపుడాకొండ నేలబరాబరిగా (పృథివ్యాం సమతాం యాతః) అణగిపోయినది – అని రామాయణము.

అటులే ఇంతవరకును దల నిక్కించియున్న అహంభావము అణగారిపోగా – దాని కవ్వలనున్న ఆనందప్రవాహము అతిశయితమైన వేగముతో కదలివచ్చి అంతఃకరణమును ముంచి ఎత్తును.

దేహాదులయందు తలయెత్తి నిలిచియున్న అహంభావమే ఆనందానుభవమునకు పెద్ద అవరోధము.

**శ్లో॥ గురువరకరుణాలహరీ–**
**వ్యతికరభరశీతలస్వాన్తః ।**
**విహరతి యతివర ఏకో**
**నిరుపమసుఖసీమని స్వైరమ్ ॥** **9**

ప్ర : గురువర = గురుదేవులయొక్క,
కరుణా = దయ అనెడి,
లహరీ = కెరటము యొక్క,
వ్యతికరభర = మిక్కుటమైన కలయిక వలన,
శీతల = చల్లనైన,
స్వాన్తః = హృదయము కలవాడై,
ఏకః = ఒకానొక,

యతివరః = యతీశ్వరుడు,
నిరుపమ = సాటిలేని,
నిత్య = నిత్యమైన,
సుఖసీమని = ఆనందపు సరిహద్దు నందు,
స్వైరమ్ = స్వేచ్ఛగా,
విహరతి = విహరించు చున్నాడు.

**తా॥** శ్రీ గురుకరుణాతరంగము లొకదానివెనుక నొకటిగా వచ్చిపడుచుండగా చల్లబడిన అంతరంగముగలవాడై – నిరుపమానందపదమున యతిరాజొకడు యథేచ్ఛము విహరించు చున్నాడు.

**వి :** 'తన శిష్యుడు దారిలో సాగుచున్నాడు. చకచక ముందుకు పోవుచున్నాడు – అద్వయానందశిఖరము నందుకొనుచున్నాడు' – అని గ్రహించిన గురువునకు ఆ శిష్యునిపై కరుణానురాగములు అంతకంతకు అతిశయింపకుండునా?

మరియు – తత్త్వమస్యాది మహావాక్యోపదేశమే శ్రీగురుకరుణాతరంగము. ఆ మహావాక్యముల మహార్థమంతరంగమునం దొక్కమారు కదలిన చాలును. స్వస్వరూప–జ్ఞానము తళుక్కుమని మెరసి – తాను ఈ సాంసారికతాపములకు మిక్కిలి దవ్వున నున్నాననిపించును. దానితో మనసు చల్లబడును. చిత్తమునందొక శాంతిరేఖ ఉదయించును.

అట్లుకాక ఇదే చింతనము. మాటిమాటికి సాగినపుడు కెరటము వెంబడి కెరటము వచ్చిపడినట్లగును. ఆధ్యాత్మిక – ఆదిభౌతిక – ఆధిదైవిక – తాపములతో అంతవరకు అట్టుడికినటు లుడుకుతున్న అంతరంగము తాపరహితమై చప్పగా చల్లారి పోవును.

సాంసారికతాపము సర్వదా శాంతించిన చిత్తమునందు ఆత్మానందరసప్రవాహము అతిశయించిన వేగముతో వెల్లివిరియుననుటలో ఆశ్చర్య మేమున్నది? అత్యుక్తి ఏమున్నది?

శ్రీగురుని ఉపదేశార్థమును '**సొమ్ము సంచిని చూరులో బెట్టి మరచితి నన్నట్లు**' చేయరాదు. ఏకాంతమునం దాయర్థమును నిరంతరమనుశీలించుచుండవలెను. అపుడు మాత్రమే గురుశిష్యులిద్దరును ధన్యులయ్యెదరు.



**అవతారిక :** ఆ గురుకరుణావిశేషమునే సూర్యకిరణములతో బోల్చి వర్ణించుచున్నారు.

**శ్లో॥ శ్రీదేశికవరకరుణా–**
**రవికరసముపోహితాన్తరధ్వాన్తః ।**

**విహరన్ మస్కరివర్యో**
**నిరవధికానన్దనీరధావాస్తే ॥** **10**

ప్ర : శ్రీదేశికవర = ఆచార్యేన్ద్రుల యొక్క,
కరుణా = దయ అనెడి,
రవి కర = సూర్యకిరణముల చేత,
సముపోహిత = పారద్రోలబడిన,
అంతరధ్వాన్తః = తన లోపలి అజ్ఞానము అనెడి చీకటి కలవాడై,
మస్కరివర్యః = ఒకానొక యతీశ్వరుడు,
నిరవధికానందనీరధౌ = హద్దులు లేని ఆనందము అనెడి సముద్రము నందు,
విహరన్ = విహరించుచూ,
అస్తే = కలదు.

**తా॥** శ్రీగురువుల కరుణ అనెడు సూర్యకిరణము ప్రసరించి – చిత్తమునందలి చిమ్మచీకటిని వెడలనడపగా – అపారమైన ఆనందసముద్రమున విహరించుచు యతిశేఖరుడు విరాజిల్లును.

**వి :** చీకటిలో వస్తువివేకము జనింపదు. దుంగ దొంగవలె – త్రాడు పామువలె దోచును. అజ్ఞానము కూడ అట్టిదే. అజ్ఞానికి 'ఆత్మ – అనాత్మగా, అనాత్మ – ఆత్మగా' దోచును.

'చిత్తమున గ్రమ్మిన చిమ్మచీకటి' – యనగా అజ్ఞానమే. సూర్యకిరణప్రసారముతో చీకటి మటు మాయమైనట్లు శ్రీగురువులు కరుణ ప్రసరింపగనే అజ్ఞానము తొలగిపోవును. గురువుల కరుణ అనగా – ఆత్మానాత్మవివేకమును గలిగించి, బ్రహ్మానుభవమును సిద్ధింపజేయు మహావాక్యోపదేశమే.

మహావాక్యార్థము అంతరంగమున జొచ్చినంతనే 'తాను జననమరణప్రవాహమున గొట్టుకొని పోవు జీవుడనన్న' చీకటి భావము అంతరించును.

'నేను అవినాశియైన పరబ్రహ్మమనే' – అన్న బోధము ఉదయించును. ఇట్టి బోధము – జ్ఞానము ఉదయింపగనే సాధకుడు ఆనందమయుడగును.

దీనికంతకును కారణము శ్రీగురుకరుణావిశేషము. అందుచే శ్రీగురు చరణములు సర్వదేవతాధికములు!!



**అవతారిక :** ఇటు లింతవరకును శ్రీగురుకరుణా విశేషమును బ్రస్తుతించి – ఆత్మలాభమునకు, బ్రహ్మానుభవమునకు ఉపకరించు సాధనవిధానములను బ్రస్తావించుచు – ఆత్మవిద్యా సంపన్నుడైన యతిశేఖరుని (జీవన్ముక్తుని) మహావైభవమును వివరించుచున్నారు.

**శ్లో॥ జనివిపరీతక్రమతో**
**బుద్ధ్వా ప్రవిలాప్య పఞ్చభూతాని ।**
**పరిశిష్టమాత్మతత్త్వం**
**పశ్యన్నాస్తే మునిశ్శాన్తః ॥ 11**

ప్ర : జనివిపరీతక్రమతః = పుట్టుకకు వ్యతిరేకదిశలో,
పంచభూతాని = పృథివ్యప్తేజోవాయ్వాకాశములనెడి ఐదు భూతములను,
బుద్ధ్వా = తన బుద్ధితో,
ప్రవలాప్య = లేవని నిర్ణయించుకొని,
పరిశిష్టమ్ = మిగిలిన,
ఆత్మతత్త్వమ్ = ఆత్మస్వరూపాన్ని,
పశ్యన్ = చూచుచు,
శాన్తః = శాంతుడై,
మునిః = ఒక ముని,
అస్తే = కలదు.

**తా॥** పంచమహాభూతములను ఉత్పత్తిక్రమమునకు వ్యతిరేకమైన దిశలో ఒకదానియందు వేరొకదానిని విలీనమొనర్చుచు – ఇటు అన్నిటిని విలీనము సేయగా – ఏది శేషించియున్నదో అదే తానని (ఆత్మయని) అనుభవించుచు యతిరాజు శాంతుడై యుండును.

వి : ఆత్మప్రాప్తికై ఒకానొక **ప్రాచీన అద్భుత సాధన విధానము** – తత్ఫలితమును శ్రీసదాశివులిందు సూచించినారు.

ఆకాశము – గాలి – అగ్ని – నీరు – నేల – ఇవి పంచభూతములు. ఇవి వరుసగా ఒకదానినుండి వేరొకటి ఉత్పన్నములైనవి. అనగా ఆకాశము నుండి గాలి – గాలినుండి అగ్ని – అగ్నినుండి జలము – జలమునుండి నేల జనించినవి.

ఆకాశము దేనినుండి పుట్టినది? '**ఆత్మన ఆకాశః సంభూతః**' – ఆత్మనాశ్రయించి మాయ తల ఎత్తగా తత్ప్రభావముచే ఆకాశము పొడమినది. ఆకాశాది పంచమహాభూతముల క్రమమిది.

వీనిని విపరీతముగా నడిపి ఒకదానియందు వేరొకదానిని విలీనము చేయవలయును. అనగా 'భూమిని – జలమునందు, జలమును – అగ్నియందు, అగ్నిని – అనిలమందు, అనిలము – నాకాశమునందు విలీన మొనర్చి – దానిని ఆత్మయందు లీనము గావింప వలయును. ఇది ఉత్పత్తిక్రమమునకు వ్యతిరేకమైనక్రమము.

దీనిని సాధనయందుంచిన యోగి – అన్నిటిని విలీన మొనరింపగా శేషించినది ఆత్మయని గుర్తించును, అనుభవించును, అనుభవించి పరమప్రశాంతిని భజించును.

ఒకానొక ఏకాంతప్రదేశమున గూర్చుండి సాధకుడు నదీనదములతో – పర్వతారణ్యములతో – చరాచరప్రాణివర్గముతో నిండి సువిశాలముగా నున్న భూమిని గూర్చి చింతింపవలయును. అనగా భావింపవలయును.

ఇట్లు కొంత సమయము ఈ చింతనయందు గడుపవలెను. పిమ్మట – ఈ భూమి యంతయును దనకు జనిస్థానమైన జలమున విలీనమైనట్లు చింతింపవలెను.

అనగా ఇంతవరకు భావనయందున్న కొండలు అడవులు చరాచరప్రాణివర్గము ఇవన్నియును జలమగ్నములై పోయినట్లు భావింపవలెను. కేవలము జలమున్నది. నీరు, నీరు, జలము, జలము. వేరేమియును లేదు. ఇట్లు కేవల జలభూతమును కొంతసమయము ధ్యానించి – అది తనకు జనకస్థానమైన అగ్నియందు విలీనమైనట్లు చింతింపవలయును.

భావనయందున్న జలమంతయును తేజముగా – జ్వాలాభీలమహాగ్నినిచయముగా మారిపోయినట్లు చింతింపవలయును. అద్భుతము అనంతము విద్యుత్ప్రభము, కింశుకసంకాశము – అయిన మహాగ్ని! మహాతేజము – ఇది భావింపబడవలయును.

ఇట్లు తేజోభూతమును గొంత తడవు ధ్యానించి – అది తనకు జనస్థానమైన వాయువునందు విలీనమైనట్లు చింతింపవలయును.

గాలికి రూపమున్నదా? లేదు? కేవలము స్పర్శ యున్నది. ఆకాశగుణమైన శబ్దము దానిని అనువర్తించి యున్నది. అనగా శబ్దస్పర్శములున్నవి.

ఇంతవరకును భావితమైన తేజోభూతము. రూపరహితమై, శబ్దస్పర్శములచే మాత్రమే తెలియబడుచున్న గాలియందు లీనమైనట్లు చింతనము సాగింపవలయును. చింతనలో అగ్నియొక్క స్థానమును గాలి ఆక్రమింపవలయును. గాలి! గాలి! ఝంఝామారుతము!

కాని ఆ గాలికి ఊగుచున్న చెట్లు లేవు. సూదులవలె – దబ్బనములవలె గాలివేగముచే పదునెక్కిన – తీక్ష్ణతను వహించిన వర్షధారలు లేవు. వాయువేగముచే నాల్కలు జాపుచున్న అగ్నిజ్వాలలు లేవు. అవన్నియు ఒకదానియందొకటి లీనమైపోయి గాలిగా మారినట్లు చింతించితిమి కదా!

అందుచే కేవలము గాలి! ఈలలు వేయుచు ఆకాశగర్భమున నిరాటంకముగ – నిర్నిరోధముగ – ఉరకలు పెట్టుచున్న – పరుగులు తీయుచున్న – సుడులు తిరుగుచున్న – క్రిందు మీదగుచున్న గాలి! పెనుగాలి! ఝంఝామారుతము! ప్రచండమైన వాయుభూతము!

ఇట్లు కేవల మరుద్భావమును జిత్తమున గొంతతడవు నిలిపియుంచి ఈ గాలి అంతయును ఆకాశమున విలీనమైనట్లు ధ్యానింపవలెను.

ఒక పాత్రను నీటిలో ముంచి వెలికి దీసి (అందు నీరుండరాదు) ఎండలో పెట్టుము. ఆరంభమున ఆ పాత్రయందు అంతటను వ్యాపించి యున్న ఆర్ద్రత (నీటితడి) క్రమముగ హరించిపోయి తడి కనబడకుండ పోవును గదా! అట్లే దీనిని గూడ భావింపవలెను.

అనగా – ఝంఝూమారుతముయొక్క వేగము తగ్గినది. చిరు కదలికలున్నవి. అవియును శాంతించుచున్నవి! శాంతించినవి!

అపుడేమున్నది? కేవల మాకాశమున్నది. కేవలము బయలు! ఖాళీ! ఆకాశము. అనంతమైన శూన్యము. మరేమియును లేదు. ఇట్లు కేవలమైన ఆకాశమును గూర్చిన ధ్యానమును కొంత తడవు సాగింపవలయును.

పిమ్మట నీయాకాశమును దాని కధిష్ఠానమైన ఆత్మయందు విలీనమైనట్లు భావింపవలెను. దేనికైనను ఆధార ముండవలయును. ఆధారమే అధిష్ఠానము. ఆకాశము భావింపబడు చున్నదనగా – దేనియందు భావింపబడుచున్నది? ఆత్మయందు, తనయందే అది భావింపబడుచున్నది కదా!

దానియందు అనగా ఆకాశభావమునకాధారమైన ఆత్మయందు ఇదెల్ల – ఈ బయలంతయు విలీనమైనట్లు భావింపవలెను.

అపుడేమున్నది? శబ్దరహితము – స్పర్శరహితము – రూప – రస – గంధ విరహితము అయిన ఆత్మ స్వరూపమున్నది! అట్టి ఆ స్వరూపమునందు నిలిచి యుండవలెను. ఆత్మోపలబ్ధికి ఇదొక అద్భుతమైన సాధనము.

సాధకుని దేహేంద్రియములు పంచభూతములకంటె వేరైనవి కావు. అందుచే ఈ ధ్యానవిధానములో సాధకుని దేహేంద్రియాదులు మిగిలి యున్నట్లు తలంపరాదు. అవికూడ పంచభూతములతో బాటు విలీనములై పోయినట్లు – కేవలము సాక్షీభూతమై ఆత్మవస్తువు మిగిలి యున్నట్లు చింతింపవలెను.

ఈ ధ్యానవిధానములో – 'ఆకాశమువరకు సాగింపవలసిన ధ్యానకృత్యము తెలివికి అందుచున్నది. కాని అటుతరువాతిది స్పష్టముగా దెలియ వచ్చుట లేదు' – అనిపించును.

**కొంతకాలము ఈ ధ్యానవిధానమును అభ్యాసములో నుంచినవానికి అదియును తెలిసివచ్చును.**

ఇట్టి ధ్యానమార్గము నవలంబించి సిద్ధుడైనవాడు నిస్తరంగసముద్రమువలె ప్రశాంతముగా నుండును – అని శ్రీసదాశివబ్రహ్మేంద్రుల వారు విశదీకరించినారు.



**శ్లో॥ జగదఖిలమిదమసారం**
**మాయికమేవేతి మనసి మన్వానః ।**
**పర్యటతి పాటితాశః**
**ప్రగలితమదమానమత్సరః కోఽపి ॥ 12**

ప్ర : ఇదమ్ = ఈ,
అఖిలమ్ = సమస్తమగు,
జగత్ = ప్రపంచము,
మాయికమేవ = మాయతో పుట్టినదే,
ఇతి = అని,
మనసి = మనస్సునందు,
మన్వానః = తలంచుచున్న వాడగుచూ,
పాటితాశః = ఆశలు అను బంధములను తెంచుకొనినవాడై,
ప్రగలిత..మత్సరః = విడిచి పెట్టబడిన మదము, మానము, మాత్సర్యము కలవాడై,
కోఽపి = ఒకానొక (పరివ్రాజకుడు),
పర్యటతి = లోకమంతట తిరుగాడుచున్నాడు.

**తా॥** ఈ జగమంతయును నిస్సారమే! మాయా కల్పితమే! అని భావించుచు ఏ కోరికయు లేనివాడై – మదమును, మానమును, మచ్చరమును వీడి జీవన్ముక్తుడొకడు యథేచ్ఛము విహరించును.

**వి :** పరబ్రహ్మ సాన్నిధ్యములో చెలగిన మాయ ఈ లోకమును కల్పించుచున్నది.

కల్పన అనగానే అది వాస్తవము కాదని తెలియుచున్నది. మాయాకల్పితమైన యీ జగము యథార్థముగా ఉన్నది కాదు. అది ఎండమావిలోని నీరు!

ఎండమావిలో దోచు నీరు దప్పికను తీర్చజాలదు. అట్లే ఆ యథార్థమైన జగము సార రహితమైనది – అని ఎవడు గాఢముగా భావించునో వానికి గోరిక లెట్లుండును?

కోరికలన్నవి – దేహ – ఇంద్రియ – అంతఃకరణములను యథార్థములని భావించి నపుడు – వీనితో దాదాత్మ్యమును అనుభవించినపుడు మాత్రమే తల యెత్తును.

అంతఃకరణప్రవృత్తియే లేనిచోట కోరికలు ఎట్లుండ గలవు? వానియందు కామక్రోధములు – లోభమోహములు – మదమాత్సర్యములు ఎట్లు నిలుచును? వాడు ఆత్మారాముడు! యథేచ్ఛావిహారి! జీవన్ముక్తుడు!

జీవన్ముక్తుడైన మహాపురుషుడు – అజ్ఞానవిలాసమైన సంసారబంధమునుండి విముక్తుడై – ఆత్మనిష్ఠుడై విరాజిల్లుటకు ఒకప్పుడొక మార్గమున – వేరొకప్పుడు వేరొక మార్గమున చింతన సాగించుచుండును.

ఆ మహాత్మునకు ఏమార్గమైనను ఆత్మలాభమును గలిగించును.

సాధకపురుషునకు ఆ జీవన్ముక్తపురుషుని మార్గములు అనుసరణీయములు.

**శ్లో॥ నాత్మని కిఞ్చిన్మాయా**
**తత్కార్యం వాఽస్తి వస్తుతో విమలే ।**
**ఇతి నిశ్చయవానన్తః**
**హృష్యత్యానన్దనిర్భరో యోగీ ॥ 13**

ప్ర : విమలే = నిర్మలమైన,
ఆత్మని = ఆత్మ యందు,
వస్తుతః = యథార్థముగా,
కించిత్ = కొంచెము కూడా,
మాయా = అజ్ఞానము,
న = లేదు.
తత్కార్యమ్ = దాని వలన ఆవిర్భవించిన జగత్తు కూడా,
నాస్తి = లేదు.
ఇతి = అని,
అన్తః = మనస్సు లోపల నిశ్చయము గల,
యోగీ = యోగి,
ఆనన్దనిర్భరః = ఆనందముతో నిండిన వాడై,
హృష్యతి = సంతసించును.

**తా॥** 'మాయకాని – తత్కార్యము గాని – ఆత్మయందు లేవు. ఆత్మ స్వతఃశుద్ధమైనది' – అన్న నిశ్చయము గలవాడై యోగి ఆనందపరిపూర్ణమైన అంతరంగముతో హృష్టుడై విరాజిల్లును.

**వి :** ఆత్మజ్ఞానము – మాయ తేజస్తిమిరముల వంటివి. వెలుగున్న చోట చీకటి నిలువ జాలదు. చీకటి రాజ్యము సాగుచున్న దనగా వెలుగు ఉదయింపనట్లే 'మాయ' అనగా తన్ను దాను మరచుట, తాను కాని దానియందు తానన్న అభిప్రాయముతో నుండుట.

ఈ మాయ – ఈ భ్రాంతి నివారితము కానంతవరకు సంసారమున్నది. దేహేంద్రియాదులున్నవి. దారపుత్త్రాదులున్నారు. ఇవి సత్యములే అన్న భావముండును.

ఎంతవరకు ఇవెల్ల సత్యములుగ దోచుచున్నవో – అంతవరకు ఆత్మలాభము కలుగలేదన్నది నిశ్చితము. ఆత్మజ్ఞాన ముదయింపగా – మాయాకార్యములైన ఇవన్నియు తమ అస్తిత్వమును గోల్పోవును.

'సూర్యుడుదయింపగా చీకటి మాసిపోయినట్లు' – 'అంతవరకు దొంగగా దోచిన దుంగ యొక్క వాస్తవ జ్ఞాన ముదయింపగా కలవరమెల్ల శాంతించినట్లు' – మాయా– తత్కార్యములు ఆత్మలాభముతో అంతరించిపోవును.

ఆత్మవస్తువు స్వతఃశుద్ధమైనది. అచట పరస్పర్శ లేదు.

ఆత్మానుభవసిద్ధుడైన యోగి – '**నాకంటె వేరైన దేదియును లేదు! ఏదియును లేదు! అంతటను నేనే నిండి యున్నాను**' అని భావించి సర్వాత్మత్వమును అనుభవించును.

ఆ అనుభవమా యోగిని బహిరంతరములయందు ఆనందపరిపూర్ణుని జేయును.

ఆ ఆనందమున కంతములేదు! ఆ హర్షమున కవధి లేదు.

**శ్లో॥ త్వమహమభిమానహీనో**
**మోదితనానాజనాచారః ।**
**విహరతి బాలవదేకో**
**విమలసుఖామ్బోనిధౌ మగ్నః ॥ 14**

ప్ర : త్వమహమభిమానహీనః = నీవు, నేను అనెడి అభిమానము లేనివాడును,
మోదిత–నానాజనాచారః = పలురకములైన జనుల ఆచారములను అంగీకరించువాడును అగు,
ఏకః = ఒకానొకడు,
విమల = స్వచ్ఛమైన,
సుఖామ్బోనిధౌ = సుఖము అను సముద్రము నందు,
మగ్నః = మునిగిన వాడై,
బాలవత్ = చిన్న పిల్లవాని వలె,
విహరతి = ఆనందముతో సంచరించును.

**తా॥** ఆత్మానందసాగరమగ్నుడైన యోగికి – '**నీవు – నేను**' అనెడి భేదబుద్ధి ఉండదు. అఖిల జనుల ఆచారములును అతనికి ఆనందమునే కలిగించును. ఆతడు బాలునివలె సదా ప్రసన్నుడై ఒక్కడై చరించును.

**వి :** ఆత్మసాన్నిధ్యమున మాయ ఈ సంసారబుద్ధిని జనింప జేయుచున్నది. సంసారము – 'నేను – నీవు'; 'వీడు – వాడు'; 'వీడు నావాడు'; 'వాడు పరుడు'; 'ఇది నాది'; 'అది వానిది'; 'దానిని నేను సొంతము చేసుకొనవలయును'; 'దీనిని కాపాడు కొనవలయును' – ఇత్యాదిగా బహువిధభేదభావములకు నిలయమైనది.

శ్రీగురుకృపాకటాక్షముచే ఆత్మజ్ఞాన ముదయింపగా మాయావిలాసమైన సంసారము – దానివలన జనించు కలవరము అదృశ్యమగును. అనగా వానికి సంసారము గోచరింపదని కాదు. గోచరించును. కాని కలవర ముండదు.

ఆకసమున్నది. నీలముగా గనబడుచుండును. అజ్ఞుడు అచట నీలవర్ణముతో నిండిన వస్తువేదో వ్యాపించి యున్నదని తలంచును. తెలిసినవాడు – 'అచట నేమియును లేదు, శూన్యమే ఆతీరున కనబడుచున్నదని గ్రహించును.

ఇచట ఆకసము అజ్ఞున కెట్లు గోచరించుచున్నదో ప్రాజ్ఞునకును అటులే గోచరించు చున్నది. కనబడుచున్నది – అని తెలియుచున్నది కదా!

అట్లే, ఆత్మవిద్యాసంపన్నుడైన జీవన్ముక్తునకు అజ్ఞునకును సంసారముయొక్క గోచరత్వములో భేదము లేదు. అజ్ఞుడు దీనిని దర్శించుచు – ఇది సత్యమని భావించును. ప్రాజ్ఞుడు – దీనిని దర్శించుచు ఇదంతయు మాయావిలాసమని గ్రహించియుండుటచే దీనియందు సక్తుడు కాడు.

ఈ కారణముచేతనే అజ్ఞునియందు 'నీవు –నేను' ఇత్యాదిగా భేదబుద్ధి తలయెత్తి యుండును. ప్రాజ్ఞునియందీ భేదబుద్ధి అంకురింపదు. అతడు సర్వమును బ్రహ్మమయముగా అనుభవించును.

ఆచారభేదములు – విధినిషేధములు సాధారణులకు, జీవన్ముక్తపురుషునకు ఈ భేదములు కూడ ఉండవు. ఆతడన్నిటిని సమభావముతో అంగీకరించును.

నేలమీద నడచుచున్నవాడు – ఇది దారి. అది డొంక; ఇది మెట్ట – అది గోయి. ఇది నేల – అది నీరు ఇత్యాది భేదములను గమనించి నడకను సాగింపవలెను. లేకున్న వాడు గోతిలో పడవచ్చును, ఏటిలో పడవచ్చును.

ఆకాశమున చరించువానికి – గగనవిహారికి ఇట్టి భేదములను నియమములను పాలించు నక్కర యుండదు. వాడు యథేచ్ఛము సంచరింప వచ్చును.

అట్లే, ఆచారభేదములు సాధారణులకు, జీవన్ముక్తునకు అన్ని ఆచారములును సమ్మతములే. అయినను బ్రహ్మానుభవమును బొందిన యోగి – తాను యథేచ్ఛము వర్తింపవచ్చునని కలుషవర్తనుడై చరింపడు. అన్ని ఆచారములను సమముగా జూచునే కాని దురాచారమును అనుసరింపడు.

బాలుని మానసమున కాపట్యముండదు. అటులే సిద్ధుడైన యోగియొక్క మానసమున కూడ నిత్యప్రసన్నముగా నుండును.

బాలుని మనోనైర్మల్యమునకు వాని అజ్ఞానము కారణము. వాడు సమలోష్టాశ్మ–కాంచనుడు. బంగారము, రాయి. మట్టిపెళ్ళ – బాలునకు సమముగనే కానవచ్చును. ఇది విలువైనది; అది విలువలేనిది – అనెడి భావము వానియందు జనింపదు. దానికి గారణము వాని అజ్ఞానము.

యోగియొక్క మానసము కూడ నిత్యనిర్మలముగా నుండును, ఇచటి నైర్మల్యమునకు గారణము జ్ఞానము.

యోగిజనులు సమలోష్టాశ్మకాంచనులై చరింతురు. వారు ఈ మట్టికిని ఆ బంగారమునకును భేదము నెంచరు. విలువ తెలియక కాదు; రెండును మాయావిలాసములే అని వారు గ్రహించి యుండుట వారి సమబుద్ధికి కారణము.

అందుచే సిద్ధపురుషుల వర్తనము బాలుని వర్తనమును బోలియుండును. వారి నిర్మలవర్తనమునకు హేతువులు మాత్రము భిన్నములైనవే.

ద్వైతము దుఃఖహేతువు, అద్వైతము ఆనందకందము. 'ఉన్నది తానొక్కడే' – అని ఎవడు గ్రహించునో – అనుభవించునో – ఆతడు అంతములేని ఆనందసాగరమున విహరించును.

---

**శ్లో॥ అవధూతకర్మజాలో**
**జడబధిరాన్ధోపమః కోఽపి ।**
**ఆత్మారామో యతిరా–**
**డటవీకోణేష్వటన్నాస్తే ॥ 15**

ప్ర : అవధూత = తిరస్కరించబడిన,
కర్మజాలః = కర్మల సముదాయము కలవాడును,
జడబధిరాన్ధోపమః = అజ్ఞాని, చెవిటి వాడు, గ్రుడ్డివాడు లతో పోల్చదగిన వాడును అగు,
కోఽపి = ఒకానొక,

యతిరాట్ = యతీశ్వరుడు,
ఆత్మారామః = తనలో తానే ఆనందించుచూ,
అటవీకోణేషు = అడవుల మూలభాగములందు,
అటన్ = తిరుగుతూ,
ఆస్తే = ఉన్నాడు.

**తా॥** బ్రహ్మవిద్వరిష్ఠుడైన సిద్ధపురుషుడు సర్వకర్మపరిత్యాగియై ఆత్మారాముడై – లోకులకు అతడొక జడుడు, చెవిటివాడు అనిపించుచు అటవీసీమలయందు విహరించుచుండును.

**వి :** సత్కర్మాచరణము స్వర్గమును దెచ్చిపెట్టును. దుష్కర్మాచరణము నరకమునకు జేర్చును. సాధారణలోకము స్వర్గప్రాపకము నరకనివారకము అయిన కర్మయందు బ్రవర్తించును.

'**అహం బ్రహ్మాస్మి**' అన్న అనుభవముతో ఎవనికి సర్వము బ్రహ్మమయముగా బోధపడినదో – ఆతడు యజ్ఞయాగాది కర్మలయందెట్లు ప్రవర్తించును?

అతడొకవేళ అట్టి కర్మలయందు బ్రవర్తించినను ఆత్మారాముడై ఆయా కర్మలను ఒక అభినయముగా ఆచరించునే కాని – కర్తృత్వబుద్ధితో – ఫలాపేక్షగలవాడై ఆచరింపడు.

అట్టి కర్మాచరణసమయమున గూడ అతడు స్వాత్మనిష్ఠుడై – బ్రహ్మము తానై యుండునే కాని సాగుచున్న కర్మమునందు తాదాత్మ్యమును భజింపడు.

అజ్ఞ జనుల కాతడొక జడునివలె – చెవిటివలె దోచును. దూషణభూషణతిరస్కారముల కాతడు కొంచెమైనను స్పందింప కుండుటయే దీనికి గారణము.

సంసారమునందు సత్యతాబుద్ధి గలవారితో లోకము వ్యవహరింపగలదు. మాటలలో వేదాంతము, ఆచరణములో లోకప్రవృత్తి కలవారిని ఆదరింపగలదు.

సర్వథా లోకబంధవిముక్తులై చరించు సిద్ధపురుషుల నీ లోకము అందుకొనలేదు. అర్థము చేసికొన జాలదు. వారిని గాంచి యీ లోకము అబ్బురపడును.

లోకవ్యవహారముతో లేశమును సంబంధములేని ఆ మహాపురుషులు లోకదృష్టికి జడులు, బధిరులు.

ఆ మహాపురుషులు జనులెవరును లేని అడవులయందున్నను – లేక జనబాహుళ్యము యొక్క నడుమ నున్నను – తమలో తాముందురు గాన అడవులయందున్నట్లే!

---

**శ్లో॥ శాన్త్యా దృఢోపగూఢః**
**శాన్తసమస్తాన్యవేదనోదారః ।**

**రమతే రసజ్ఞ ఏకో**
**రమ్యే స్వానన్దపర్యఙ్కే ॥ 16**

ప్ర : శాన్త్యా = శాన్తితో,
దృఢోపగూఢః = బాగుగా కౌగలించుకొనబడినవాడును,
శాన్త = నశించిన,
సమస్తవేదనోదారః = సమస్తములగు పెద్ద పెద్ద బాధలు కలవాడును అగు,
ఏకః = ఒకానొక,
రసజ్ఞః = మనోహరమైన,
స్వానన్దపర్యంకే = ఆత్మానందము అనెడి తల్పము నందు,
రమతే = క్రీడించుచున్నాడు.

**తా॥** జీవన్ముక్తుడైన మహాత్ముడు – ఇతరములైన వేదనలెల్ల శాంతింపగా మహితుడై – పరమానందమన్న సెజ్జపై శాంతిదేవిని గాఢము కౌగిలించుకొని రమించుచుండును.

**వి :** అంతఃకరణము – ఇంద్రియములు – ఇవి బహిర్ముఖప్రవృత్తి కలవి. అవి శబ్ద – స్పర్శ – రూప – రస – గంధాత్మకములైన విషయముల వంక పరువెత్తుచు నుండును. వానియొక్క ఈ బహిర్ముఖప్రవృత్తి అశాంతినే తెచ్చి పెట్టును.

జీవన్ముక్తుని ఇంద్రియములు అంతరంగము బహిర్ముఖప్రవృత్తిని గోల్పోవును. ఆ మహాపురుషునియందు వానికి అంతర్ముఖవృత్తి నిత్యసిద్ధమగును.

సాధన దశయందున్న వాడు సహజముగా విషయముల వంక బరువెత్తుచున్న తన ఇంద్రియములను ప్రయత్నపూర్వకముగా వెనుకకు మరల్చి ఆత్మాభిముఖములుగా నిలువబెట్టు చుండును. జీవన్ముక్తునియందలి ప్రయత్నము లేకయే ఆత్మాభి ముఖములగుచు అవి నిష్క్రియములగును. ఆ మహాత్ముడు చేపలు నిద్రించియున్న చెరువువలె ('సుప్తమీన ఇవ హ్రదః' – రఘువంశము) శాంతాంతరంగుడై విరాజిల్లును. అట్లున్న స్థితియే శాంతి దేవీ గాఢాలింగనముగా ప్రస్తుతింపబడెను.

నిర్వికల్పమైన యీ స్థితియందు యోగి అన్యమెరుంగక ఆత్మారాముడై ఆనందించును.

---

**శ్లో॥ ఉన్మూలితవిషయాలిః(ళిః)**
**స్వీకృతవైరాగ్యసర్వస్వః ।**
**స్వాత్మానందమహిమ్ని**
**స్వారాజ్యేఽస్మిన్ విరాజతే యతిరాట్ ॥ 17**

ప్ర : ఉన్మూలిత-విషయారిః...
ఉన్మూలిత = నిర్మూలించబడిన,
విషయారిః = విషయములు అనెడి శత్రువులు కలవాడును,
స్వీకృత-వైరాగ్య-కోశసర్వస్వః...
స్వీకృత = స్వాధీనం చేసుకొన బడిన,
వైరాగ్య = వైరాగ్యము అనెడి,
కోశసర్వస్వః = సమస్త ధనాగారము కలవాడును అగు,
యతిరాట్ = యతీశ్వరుడు,
స్వాత్మానన్దమహిమ్ని = గొప్పదైన ఆత్మానందము అనెడి,
అస్మిన్ = ఈ,
స్వారాజ్యే = స్వారాజ్యమునందు,
విరాజతే = ప్రకాశించుచున్నాడు.

**తా॥** జీవన్ముక్తుడైన యతిచక్రవర్తి - శబ్ద స్పర్శాది విషయములనెడు శత్రువులను నిర్మూలించి యుండును. విరక్తి అనెడు ధనాగారములోని ధనమెల్ల ఆతనికి స్వాయత్తమై యుండును. ఇటులున్న ఆ మహాపురుషుడు ఆత్మానంద మహితమైన స్వరాజ్యమున విరాజిల్లుచుండును.

**వి :** శబ్దముచే చెవి, స్పర్శసుఖముచే త్వగింద్రియము, రూపముచే చక్షురింద్రియము, రసముచే జిహ్వేంద్రియము, గంధముచే ఘ్రాణేంద్రియము ఆకర్షింపబడి వానికి (ఆ విషయములకు) వశవర్తులై చరించుచుండును. శబ్దాది విషయములు శ్రోత్రాది ఇంద్రియములను తమ వశమం దుంచుకొని తమ చుట్టును త్రిప్పుకొనుచుండును. ఇది సాధారణ లోకస్థితి.

ఆత్మసామ్రాజ్యమునుండి భ్రష్టుని గావించి - తమకు ఊడిగము చేయించుకొనుచున్న - ఈ శబ్దాదివిషయశత్రువులను యతిచక్రవర్తి నిర్మూల మొనర్చి యుండును. వాని పాదులను పెకలించి వేయును. అటులొనర్చుటచే అతని యింద్రియములు విషయబంధములనుండి విముక్తములై యుండును.

ఇంతవరకు విషయసక్తములైన ఇంద్రియములు వానినుండి విరక్తములగును. ఈ విరక్తి - ఈ వైరాగ్యము వానికి పుష్టిని బలమును చేకూర్చును. పరసేవనములో నీరస పడిన ఇంద్రియములు - వైరాగ్యధనసంపన్నములై ప్రకాశించును. అపుడు ఆత్మానంద ప్రాప్తికి ఒక ఆటంకముండదు.

యతిలోకచక్రవర్తి మాత్రమే దీనిని సాధించును. ఆత్మానందప్రాప్తికి విషయాసక్తి ప్రబలావరోధమన్నది సారము.



**శ్లో॥ సవితర్యపి శీతరుచౌ**
**చన్ద్రే తీక్ష్ణేఽప్యధో వహత్యగ్నౌ ।**
**మాయికమిదమితి జానన్**
**జీవన్ముక్తో న విస్మయీ భవతి ॥ 18**

ప్ర : సవితరి = సూర్యుడు,
శీతలరుచౌ అపి = చల్లని వెన్నెల కాయువాడు అయినను,
చన్ద్రే = చంద్రుడు,
తీక్ష్ణేఽపి = ఎండ కాయువాడు అయినను,
అగ్నౌ = అగ్ని,
అధః = క్రిందకు,
వహత్యపి = జ్వలించువాడు అయినను,
జీవన్ముక్తః = జీవించి ఉండగనే ముక్తి పొందిన యోగి,
ఇదమ్ = ఇది అంతయును,
మాయికమితి = మాయామయము,
ఇతి = అని,
జానన్ = తెలిసికొనుచూ,
న విస్మయీ భవతి = ఆశ్చర్యమును పొందదు.

**తా॥** సూర్యుడు చల్లగా – చంద్రుడు వెచ్చగా దోచినను – అగ్ని అధోముఖమై జ్వలించినను – ముక్తపురుషుడు ఇదంతయును మాయావిలాసమే అని భావించునే గాని ఆశ్చర్యము ననుభవింపడు.

**వి :** సూర్యునకు వేడి, చంద్రునకు చల్లదనము స్వభావసిద్ధములు. అటులే అగ్నికి ఊర్ధ్వముఖ జ్వలనము (అగ్నిజ్వాల పైకి లేచును గాని క్రిందుగా మొగము పెట్టదు) స్వభావము. వీని యీ స్వభావము లెన్నడును మారవు.

మార్పు వచ్చి – సూర్యుడు చంద్రునివలె చల్లదనమును, చంద్రుడు సూర్యునివలె వెచ్చదనము వెదజల్ల నారంభించినపుడు – అగ్ని అధోముఖముగా జ్వలించినపుడు – ఎంతటి గంభీరప్రకృతియైనను ఆశ్చర్యపడును. విస్మయమును భజించును.

కాని బ్రహ్మవిదాంవరుడైన యోగి దీనిని గాంచి కొంచెమును ఆశ్చర్యమును పడడు.

అతడు సర్వమైన జగమును మాయాకల్పితముగా గ్రహించినవాడై – అదెట్టిదైనను – హర్ష – శోఖ – విస్మయాదుల ననుభవింపడు.

**శ్లో॥ శోకస్థానసహస్రాణి - హర్షస్థానశతాని చ ।**
**దివసే దివసే యూఢ - మావిశన్తి న పండితమ్ ॥** - భారతము.

రోజుకు వేయిసార్లు ఏడ్చి - వందసార్లు నవ్వుట మూఢుని లక్షణము. పండితుడు హర్ష శోకములకు అతీతుడు.

కాగా జగమెవనికి మాయాకల్పితమన్న నిశ్చయబుద్ధి జనించియున్నదో - వానికి - జగత్సంబంధులైన వికారములెల్ల మాయాజన్యములుగనే దోచునుగాని సత్యములుగా ఎట్లు తోచును?

**శ్లో॥ అజ్ఞానవైరివిజయీ**
**ప్రజ్ఞామాతఙ్గమస్తకారూఢః ।**
**విహరతి సంయమిరాజః**
**సమరససుఖధామ్ని సర్వతో రమ్యే ॥** **19**

ప్ర : అజ్ఞాన = అజ్ఞానము అనెడి,
వైరి = శత్రువును,
విజయీ = జయించినవాడును,
ప్రజ్ఞా-మాతఙ్గ-మస్తకారూఢః...
ప్రజ్ఞా = విజ్ఞానము అనెడి,
మాతఙ్గ = ఏనుగు యొక్క,
మస్తక = శిరస్సును (కుంభస్థలమును),
ఆరూఢః = ఎక్కిన వాడును అగు,
సంయమిరాజః = యతీశ్వరుడు,
సర్వతః = అన్నివైపులా,
రమ్యే = రమణీయమైన,
సమరస-సుఖధామ్ని...
సమరస = ఎక్కువ తక్కువలు లేని సమానమైన ఆనందము కల,
సుఖధామ్ని = ఆనందభవనము నందు,
విహరతి = ఆనందముతో సంచరించును.

**తా॥** యతిశేఖరుడు అజ్ఞానమన్న శత్రువుపై జయమును సాధించి - జ్ఞానమన్న ఏనుగు నెక్కి సర్వతోరమ్యమైన పరమానందధామమున విహరించును.

వి : ఆత్మయందు అనాత్మబుద్ధి – అనాత్మయందు ఆత్మబుద్ధి అజ్ఞానముచే గలుగుచున్నది. దీనివలన సంసారబంధమేర్పడుచున్నది. అందుచే సంసారబంధమును గలిగించు అజ్ఞానము శత్రువు.

జీవన్ముక్తునియందు అజ్ఞానచర్యలుండవు. దేహాదులయందు తానన్న భావము – ఆత్మయందు అనాత్మబుద్ధి ఆతని యందుండవు. ఈ కారణముచే అతడు అజ్ఞానమన్న శత్రువును నిర్జించినవాడుగా గీర్తింపబడుచున్నాడు.

జ్ఞానోదయ మైనపుడు కదా అజ్ఞానవినాశము! ఇదిగో ఇది నా వాస్తవరూపము అని తెలిసికొని – ఆ తెలివియందే – నిలిచిన వాడు – గజారూఢునివలె వైభవోన్నతుడై ప్రకాశించు చున్నాడు.

అట్లున్నవాడు అనుభవించు ఆనందమునకు అంతము లేదు.

చెఱువులు – సరస్సులు ఎంత పెద్దవైనను – సముద్రమును జూచిన కన్నులకు అవి చిన్నవే – అల్పాల్పములే.

అట్లే ఆత్మానందమునందు ఇహలోకములోని ఆనందములు – పరలోకములని ఆనందములు – ఇంద్రాది పదములు – సూర్యునిముందు దివిటీ వెలుగుల వలె వెలవెలబోవును. ఆత్మానందమునకు సాటికాగల ఆనందము వేరొకటి లేనేలేదు.

అజ్ఞానమును అణగద్రొక్కి జ్ఞానగజారూఢుడైన యతిరాజు అట్టి పరమానందమున విహరించుచున్నాడు.

ఇవేవో ఇవి (అజ్ఞానముపై విజయము – జ్ఞానగజారోహణము – పరమానందానుభవము) ఒకదాని వెంబడి ఒకటిగా సాధింపవలసిన మూడు పనులు కావు.

ఇదొక్కటే కృతము. అజ్ఞానముపై విజయసాధనము! దీపము వెలుగుటకును చీకటి తొలగుటకును మధ్య అంతరముండనట్లు – జ్ఞానోదయముతో అజ్ఞానము వినష్టమగును. అచ్చమైన జ్ఞానభూమికయందు నిలచుటయే పరమానందధామవిహారము!

అందుచే తెలివికలవాడు ఆత్మానాత్మవివేకమును బెంపొందించు సాధనమార్గమున అభ్యాసము సాగింపవలయును.

---

**శ్లో॥ శాన్తాహంకృతిదోషః**
**సుసమాహితమానసః కోఽపి ।**
**పూర్ణేన్దుశిశిరభావో**
**రాజత్యానన్దసత్యచిద్రసికః ॥ 20**

ప్ర : శాన్తాహఙ్కృతిదోషః...
శాన్త = శమించిన,
అహఙ్కృతిదోషః = అహంకారము అనెడి దోషము కలవాడును,
సుసమాహిత-మానసః...
సుసమాహిత = బాగా (బ్రహ్మ యందు) ఏకాగ్రముగ ఉంచబడిన,
మానసః = మనస్సు కలవాడును అగు,
కోఽపి = ఒకానొక,
ఆనంద-సత్య-చిద్రసికః = సత్ చిత్ ఆనంద రూపమైన ఆత్మజ్ఞానరసికుడు,
పూర్ణేన్దు-శిశిరభావః...
పూర్ణేన్దు = పున్నమి నాటి చంద్రునివలె,
శిశిరభావః = చల్లనివాడై,
రాజతి = ప్రకాశించు చున్నాడు.

**తా॥** సచ్చిదానందమయమైన పరబ్రహ్మమున నిత్యరమణశీలుడైన యోగియందు - '**అహంకారదోషము**' ఉండదు. అతని మానసము అన్నివైపుల నుండియును ప్రోవుచేయబడి సమాహితమై యుండును. పున్నమిచంద్రునివలె చల్లనైన భావములతో నిండి ఆనందరసికుడైన అట్టియోగి ఎచటనోగాని లభింపడు.

**వి :** మనము పుట్టుటకు పూర్వము లేము. మరణానంతరముండము; అట్లుకాక సృష్టికి బూర్వము - ప్రళయానంతరము కూడ నిర్వికారముగ నిలిచి యుండునది సత్ అనబడును. పరబ్రహ్మము సత్స్వరూపము. అది చిన్మయము. (జ్ఞానస్వరూపము) మరియును ఆనందమయము.

దేహేంద్రియాదులయందు 'నేను' అనెడి భావమును నిలుపుటయే అహంకారదోషము. ఇది ఆత్మోపలబ్ధికి గట్టి అవరోధము. దీనివలననే సంసారబంధము.

జీవన్ముక్తుడైన యోగియందు అహంకారదోషము ఉండదు. నశ్వరములైన దేహేంద్రియాదులను తానుగా ఆతడెన్నడును భావింపడు. జననమరణరహితమై సదా నిర్వికారముగా నుండు పరబ్రహ్మమే తానన్న అనుభూతి యందాతడు నిమగ్నుడై యుండును.

మన మనస్సు వివిధవిషయములందు నిక్షిప్తమై యుండును. చెదరి పడియుండును. ఒక సంచితో బియ్యము తెచ్చితిమి. ప్రమాదవశమున అది చేయి జారినది. బియ్యము నేలపై అన్నివైపులకు చెదరిపోయినవి. అట్లే వివిధ విషయముల యందు చెదరిపడియున్న మానసమును - ఆ బియ్యము ప్రోవుచేసినట్లు - యోగీంద్రుడు ప్రోవొనరించును. సమాహిత మొనరించును.

ఇట్లగుటచే అతని మానసము తాపరహితమగును. చంద్రునివలె చల్లనైన అంతఃకరణ వృత్తులు కలవాడై యోగి బ్రహ్మానందరసికుడై విరాజిల్లును.

అహంకారదోషమే జీవకోటికి బ్రహ్మానుభవమును కలుగ నిచ్చుట లేదు.

**శ్లో॥ తిష్ఠన్ పరత్ర ధామ్ని**
**స్వీయసుఖాస్వాదపరవశః కశ్చిత్ ।**
**క్వాపి ధ్యాయతి కుహచి-**
**ద్గాయతి కుత్రాపి నృత్యతి స్వైరమ్ ॥ 21**

ప్ర : పరత్ర = పరబ్రహ్మము అనెడి,
ధామ్ని = గొప్ప ప్రదేశమునందు,
తిష్ఠన్ = నివసించుచూ,
స్వీయ-సుఖాస్వాద-పరవశః...
స్వీయ = తనది యగు,
సుఖ = సుఖము యొక్క,
ఆస్వాద = అనుభవము చేత,
పరవశః = మైమరచిన వాడు అగు,
కశ్చిద్ = ఒకానొక యోగి,
క్వాపి = ఏదో ఒక ప్రదేశమునందు,
ధ్యాయతి = ధ్యానము చేయుచూ ఉండును.
కుహచిత్ = మరి యేదో ప్రదేశమునందు,
గాయతి = గానము చేయుచూ ఉండును,
కుత్రాపి = ఇంకేదో ప్రదేశమునందు,
స్వైరమ్ = స్వేచ్ఛగా,
నృత్యతి = నాట్యము చేయుచూ ఉండును.

**తా॥** పరమోన్నతమైన బ్రహ్మపదమున వసించుచు - ఆత్మానందరసాస్వాదపరవశుడై - ఒకచో ధ్యానమగ్నుడు - వేరొకచో గానమగ్నుడు - ఇంకొకచో నృత్యమగ్నుడునై చరించు యోగివర్యు డెచటనో గాని లభింపడు.

**వి :** మానవులకంటె దేవతలు - దేవతలకంటె హరిహరహిరణ్యగర్భులును అధికులు. పరబ్రహ్మపదార్థము వారి కంటెను మిన్నయైనది.

**"పరమాద్వైతవిజ్ఞానీ మయారాధ్యః సదైవ తు ।**
**నారాయణేన రుద్రేణ తదా దేవైర్విశేషతః ॥"** – బ్రహ్మగీత.

"అద్వయజ్ఞానసంపన్నుడైన యోగి నాకు సర్వదా పూజ్యుడు. నాకే కాదు. నారాయణునకు – రుద్రునకును గూడ ఆత డారాధ్యుడై యున్నాడు. ఇక దేవతలు ఆ మహాత్ముని నధికముగా సేవింపదగినవారని వేరే చెప్పనక్కరలేదు" – అని బ్రహ్మగీత.

బ్రహ్మవిద్వరేణ్యుడు ఇంద్రపదవిని – బ్రహ్మపదవిని గూడ గడ్డిపరకగా జూచును. ఆతడు తృణీకృతబ్రహ్మపురంధరుడు. అతడనుభవించు ఆనందము ఇంద్రపదమున – బ్రహ్మపదమున లేదు. అందుచే పరబ్రహ్మము సర్వోన్నతమైనది.

యోగివర్యుడు పరబ్రహ్మమే తానన్న జ్ఞానభూమికయందు సుస్థిరుడై – ఆత్మానంద-రసాస్వాదపరవశుడై యుండును.

లోకములోని ఏ ఆనందమును ఆత్మానందమునకు సాటి కాదు. మరియు విషయానందము లన్నియును – ఆత్మానందసాగరమునుండి చెదిరిన శీకరములే. తుంపరలే.

**"న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి"** – బృహదారణ్యకము.

ఒక వనిత తనభర్తను మిక్కిలి ప్రేమించుచున్నది. తానుగా ఆమెయు, ఆమెను జూచుచున్న లోకమును – ఆమెకు గల పతిప్రేమ అపారము. నిరుపమము అనియే భావించుచున్నారు. కాని వాస్తవమది కాదు.

"ఆమెకు తనయందే ప్రేమ. పతియందు కాదు" – అని శ్రుతి తెలుపుచున్నది. ఆ భర్త వలన తనకు సుఖము లభించుచుండుట చేతనే ఆమె భర్తను అంతగా ప్రేమించుచున్నది. తన ఆనందమునకై ఆమె పతిని ప్రేమించుచున్నది. ఆమె తనయందే ప్రేమ అని విశదమగుచున్నది.

ఇట్లు లోకములో ఎవరు దేని నెంతగా ప్రేమించుచున్నట్లు కానవచ్చినను దాని కంతకును ఆత్మప్రేమ కారణము.

ఒకడు తల్లిని భార్యను వెంటబెట్టుకొని ఏటిని దాటు చున్నాడు. ఏరు వేగముగా ప్రవహించుచున్నది. భార్యను, తల్లిని పొదవి పట్టుకొని వాడు ఏటిని దాటుచున్నాడు.

ప్రవాహవేగము నీటిలోతు అధికములగుచున్నవి. ఇద్దరిని కాపాడుకొనుచు నడచుట కష్టముగా నున్నది. తల్లి, భార్య ఇద్దరి కాళ్ళు నీటిలో తేలిపోవుచున్నవి. వారు వీనిని బట్టుకొని వ్రేలాడుచున్నారు. వాడు ఈ యిద్దరితో ఏటిని దాట జాల ననుకొన్నాడు. ఎవరిని వదలుట? తల్లి, భార్య. వాడు తల్లిని వదలినాడు. భార్యను బట్టుకొని నడువసాగెను.

తల్లినే ఏల వదలెను? భార్య నేల వదల లేదు? వానికిపుడు తల్లి వలన కంటె భార్యవలన లభించు సుఖమెక్కువ. అందుచే తల్లిని వదలినాడు.

వాడు భార్యతో నడచుచు ఒకగోతిలో పడినాడు. నీరెక్కువగా ఉన్నది. వాడు ఉక్కిరిబిక్కిరియైనాడు. భార్యను రక్షించుకొనుచు తనను రక్షించుకొనుట కష్టమనిపించినది.

తనను గట్టిగా బట్టుకొనియున్న భార్యను వదలించుకొనినాడు. నీటిలోనుండి తలపైకెత్తినాడు. ఈదుకొని యొడ్డునకు జేరినాడు.

ఈ ఉదాహరణగాథను కొంచెము పరిశీలన చేయుదము.

ఆతనికి తల్లిమీద భార్యమీద ప్రేమయున్నది. కాని తనమీద ప్రేమ ఎక్కువ. ఆ యిద్దరివలన దనకు సుఖము లభించుచున్నది గాన నాతడా యిద్దరిని బ్రేమించుచు వచ్చినాడు. వారిపై ప్రేమకు గూడ తనమీది ప్రేమయే కారణము. ఎపుడు తనకే ముప్పు వచ్చుచున్నదని తోచెనో అపు డాతడు ఒకరితరువాత నొకరుగా నాయిద్దరను ఏటిలో వదలి తాను బయట పడినాడు.

**ఏ ఆనందమును ఆత్మానందమునకు సాటికావు.**

అచ్ఛమైన ఆత్మానందమునునుభవించు మహాత్ముడు ఆ యానందమున బరవశుడై ఒకచో ధ్యానము సేయుచు పడియుండును, ఒకచో పాడును, ఒకచో ఆడును. "**అతడాత్మానంద మదిరామత్తుడు గదా!**"

---

**శ్లో॥ అగృహీతాఘకలఙ్కః**
**ప్రశమితసఙ్కల్పవిభ్రమః కోఽపి (ప్రాజ్ఞః) ।**
**న్యక్కృతకార్యకలాప-**
**స్తిష్ఠత్యాపూర్ణసీమని క్వాపి ॥ 22**

ప్ర : అగృహీతాఘ–కలఙ్కః...
అగృహీత = స్వీకరించబడని (దూరముగా ఉంచబడిన),
అఘ–కళఙ్కః = పాపము అనెడి కళంకము కలవాడును,
ప్రశమిత–సఙ్కల్ప–విభ్రమః...
ప్రశమిత = బాగుగా ఉపశమించిన,
సఙ్కల్ప విభ్రమః = మనోవ్యాపారములనెడి భ్రమలు కలవాడును,
న్యక్కృత–కార్యకలాపః...

న్యక్కృత = తిరస్కరించబడిన,
కార్యకలాపః = కర్మల సముదాయము కలవాడును, అగు;
ప్రాజ్ఞః = వివేకి,
క్వాపి = ఎక్కడనో,
ఆపూర్ణసీమని = సంపూర్ణమైన ఆత్మ అను స్థానమునందు,
తిష్ఠతి = ఉండును.

**తా॥** సర్వమును దెలిసినవాడు - పాపమాలిన్యమంటని వాడై శాంతించిన సంకల్పముల సందడిగలవాడై - సర్వకర్మలను విసర్జించి, వెలితియన్నదిలేక అంతటను నిండియున్న అఖండపరబ్రహ్మస్వరూపమున నిమగ్నుడై యుండును. అట్టి మహాత్ముడెచటనో గాని లభింపడు.

**వి :** అఘమనగా పాపము, పాప మెవడాచరించును? విషయాసక్తు డాచరించును. విషయాసక్తి దేహేంద్రియములందలి తాదాత్మ్యముతో జనించుచున్నది.

లోకము రెండు రకములు. పాపకార్యాసక్తమైనది. పుణ్యకార్యాసక్తమైనది. పాపము దుఃఖభోగమునకై శరీరమును దెచ్చిపెట్టును. పుణ్యము సుఖానుభవమునకై శరీరమును గల్పించును.

ఇవి రెండును జీవుని సంసారమున బంధించి యంచునవియే. రెండును బంధములే. ఒకటి ఇనుపసంకెల. రెండవది బంగారుసంకెల.

అజ్ఞ జనము తమయందు జనించిన విషయాసక్తిని నిగ్రహింపజూడదు. దానికొక అవరోధమును గల్పింపదు. నిర్ణిరోధముగ దానిని సాగనిచ్చును. అటులొనరించుటచే పాపాచరణము సంభవించును.

ఇంచుక తెలివైనవారు - తమయందలి విషయాసక్తికి కొన్ని హద్దులు - పరిమితులు కల్పించి - సుఖభోగమును దెచ్చిపెట్టు పుణ్యకర్మముల నాచరింతురు.

ఇద్దరును శరీరేంద్రియాదులతోడి తాదాత్మ్యము గల వారే. ఇద్దరును ఆత్మసామ్రాజ్యము నుండి భ్రష్టులైనవారే.

దేహేంద్రియములతోడి తాదాత్మ్యమే సర్వపాపములకును మూలము. ఈ శరీరమును తానుగా భావించుటయే మహాపాపము.

ఈ తాదాత్మ్యమును వీడి యోగిపుంగవుడు విరాజిల్లును. అందుచే అతడు పాప-పుణ్యములకు అతీతుడై యుండును. వానికి (పుణ్యపాపములకు) జెందిన అల్పమాలిన్యమైనను వాని యందుండదు.

మనసును యథేచ్ఛముగా ఇంద్రియముల దారులగుండా శబ్దాది విషయములవంక పరువెత్త నిచ్చినపుడు – దాని యందుదయించు సంకల్పములకు (కోరికలకు) అంత ముండదు.

శబ్ద స్పర్శ రూప రసాదులచే ఆకృష్టమగుచు చిత్తము వివిధసంకల్పములతో నిండును. (శబ్దమున రమించుచు స్పర్శ సుఖమును వాంఛించును. స్పర్శ సుఖమందుండి – రూపదర్శన కాంక్ష గలదగును. ఇట్లు దానియందలి సంకల్పములకు అంతముండదు.)

ఇట్టి విషయాభిముఖసంకల్పముల సందడిలో – కామక్రోధాదులు తలయెత్తును. అపుడు నాయకత్వము వాని చేతులలోనికి బోవును.

ఒక మహానగరమునం దేకారణముచేతనో సమ్మె జరుగు చున్నది. జనులు ఎక్కువగా వీథులయందేవో నినాదము లొనరించుచు పరిభ్రమించుచున్నారు. అట్టివేళ దుర్జనులు (గూండాలు) వారితో గలియుదురు. ఆ సమ్మెయొక్క లక్ష్యము మారిపోవును. దుష్కార్యములు జరుగును. హింస జరుగును. వినాశము సంభవించును.

అటులే విషయాభిముఖవృత్తుల ఆధిక్యమున కామక్రోధాదులు తలయెత్తి నానాభీభత్సమును గల్పించును.

ప్రాజ్ఞునకు దేహతాదాత్మ్యమే లేదు. ఇక వాని చిత్తము ఇంద్రియముల దారులగుండా విషయములవంక పరువెత్తుట ఎట్లు జరుగును?

ఇట్టి సంకల్పరహితమైన మానసమున – కామక్రోధాదులు తలయెత్తి స్వేచ్ఛా విహారమెట్లు చేయును?

అందుచే యోగీశ్వరుని చిత్తము సంకల్పముల సందడి లేనిదై ప్రశాంతముగా నుండును.

అతడు "**అపారము – అనంతము – అఖండము – నిస్సీమము – సార్వదేశికము – సార్వకాలికము – వెలితి యనునదిలేక పూర్ణవస్తువునై యున్న పరబ్రహ్మమునందు**" – సుస్థిరాసనాసీనుడై విరాజిల్లును.

---

**శ్లో॥ చపలం మనఃకురఙ్గం**
**చారు గృహీత్వా విమర్శవాగురయా ।**
**నిగమారణ్యవిహారః**
**శ్రాన్తః శేతే స్వధామ్ని కోఽ ప్యేకః ॥ 23**

ప్ర : చపలమ్ = చంచలమైన,
మనః = మనస్సు అనెడి,

కురఙ్గమ్ = లేడిని,
విమర్శ–వాగురయా...
విమర్శ = సరి అయిన జ్ఞానము అనెడి,
వాగురయా = వలతో,
చారు = నైపుణ్యముగా,
గృహీత్వా = పట్టుకొని,
నిగమారణ్య–విహార–శ్రాన్తః...
నిగమ = వేదములు,
అరణ్య = అడవి యందు,
విహార = తిరుగాడుట చేత,
శ్రాన్తః = అలసిన,
కోఽపి = మాటలతో వర్ణించుటకు వీలు కాని,
ఏకః = ఒకడు,
స్వధామ్ని = తన ప్రదేశము నందు (ఆత్మ యందు),
శేతే = నిద్రించుచున్నాడు (విశ్రాంతిని పొందుచున్నాడు)

**తా॥** చంచలమైన మనస్సు అనెడి – లేడిని, విమర్శ యనెడి ఉచ్చున జిక్కబట్టి – వేదారణ్య విహారియై – అలసి – సొలసి ఆత్మధామమున సుఖముగ నెవడో శయనింప గలుగును.

**వి :** లేడి చంచలమైనది. అది తెప్పపాటుకాలములో ఎచటికో పరువెత్తును. దానిని బట్టుకొనుట సుఖసాధ్యము కాదు.

అట్టిదే మనస్సు. అది '[1]ప్రమాణ – [2]విపర్యయ – [3]వికల్ప – [4]నిద్రా – [5]స్మృతి 'వృత్తుల' – నవలంబించి – విషయారణ్యముల యందు విహరించుచుండును.

1. '**ప్రమాణ – విపర్యయ – వికల్ప – నిద్రా – స్మృతయః**' – యోగసూత్రములు

ప్రమాణాలైదును మనసుయొక్క నడకలు.

1. ప్రమాణము : ఇది ప్రత్యక్ష – అనుమాన – ఆగమ రూపమున మూడు రకములు.

2. విపర్యము : అనగా మిథ్యాజ్ఞానము. ఒకదానిని జూచి వేరొకటిగా దలంచుట విపర్యయము.

3. వికల్పము : శబ్దశ్రవణ మాత్రమున మనసు ఒకరూపము నేర్పరచుకొనుటకై కదలును. ఆ కదలిక వికల్పము. ("రాహుశీర్షము" అన్నంతనే దానిని జూడకున్నను – మనసు ఒకరూపమును కల్పించుకొనును. అట్టి కదలిక వికల్పము.)

4. నిద్ర : అభావమును (ఏమియును లేకపోవుటను) భావించుటకై మానసికమైన వృత్తి నిద్ర.

5. స్మృతి : పూర్వానుభూతవిషయమును భావనాదార్ఢ్యముచే రూపు గట్టించుకొనుటకై మనసు అవలంబించు వృత్తి స్మృతి.

శబ్దారణ్యమునుండి స్పర్శారణ్యమునకు – దానినుండి రూపారణ్యమునకు – అటనుండి రస – గంధారణ్యములకు అది ప్రమాణాదులైన వృత్తులను (నడకలను) మార్చుచు దూకు చుండును. పరువెత్తుచుండును. అట్టి దానిని నిలువరించుట ఎట్లు? కదలకుండ కట్టివేయుట ఎట్లు?

నిరంతరము పరువెత్తు లేడిని బట్టుకొనుటకు ఒకవల లేదా ఉచ్చు వంటి సాధనము అవసరము. మనసును బట్టుకొనుటకు విమర్శ – ఆత్మవిమర్శ – జగద్విమర్శ సాగించుచు తనను దేహేంద్రియాదులకంటె భిన్నమైన వానినిగా భావించుట ఒక ఉచ్చువలె ఉపయోగ పడును. ఉచ్చులో జిక్కిన లేడివలె ఆత్మవిమర్శనము సాగించుమని మానసము నిగ్రహింపబడును.

అడవిలో దారికనుగొనుట కష్టము. ఏది ఎచటకు గొంపోవునో తెలియదు. అట్లే వేదముల అర్థము నెరుంగుట కష్టము. మిక్కిలి శ్రమించిన వానికి గాని వేదార్థము – అవగతము కాదు. అట్లు శ్రమించిన ధీరునకు వేదములు '**సర్వం బ్రహ్మమయ**' మ్మని బోధించుటయందే తాత్పర్యము గలవని తెల్లమగును.

అభ్యాసవైరాగ్యములతో సుష్ఠు కల్పితమైన ఆత్మవిమర్శ అనెడు ఉచ్చులో మనసు అనెడి లేడిని జిక్కబట్టి – వేదారణ్యములలో దిరిగి తిరిగి – "సర్వం బ్రహ్మమయ" మని "**నేహ నానాస్తి కిఞ్చన**" – అని గ్రహించుటయందు అలసిన యోగిసత్తముడు – తిరిగి తిరిగి మిక్కిలి అలసి, ఇంటికి జేరి సుఖముగ నిద్రించిన వానివలె – '**అహం బ్రహ్మాస్మి**' అన్న జ్ఞానభూమిక నధిరోహించి – అన్యమెరుంగని వాడై వర్తిల్లును.

**శ్లో॥ దారుణచిత్తవ్యాఘ్రం**
**ధీరమనఃఖడ్గధారయా హత్వా ।**
**అభయారణ్యే కో౽పి**
**స్వైరవిహారీ జయత్యేకః ॥** **24**

ప్ర : దారుణ–చిత్త–వ్యాఘ్రమ్...
దారుణ = భయంకరమగు,

చిత్త = మనస్సు అనెడి,
వ్యాఘ్రమ్ = పెద్దపులిని,
ధీర–మనః–ఖడ్గధారయా...
ధీర = ధైర్యముకల,
మనః = మనస్సు అనెడి,
ఖడ్గధారయా = కత్తి యొక్క అంచుతో,
హత్వా = చంపి,
కోఽపి = మాటలతో వర్ణించుటకు వీలు కాని,
ఏకః = ఒకడు (ఒకానొక యోగి),
అభయారణ్యే = నిర్భయమైన అడవి యందు,
స్వైరవిహారీ = స్వేచ్ఛగా సంచరించుచూ,
జయతి = వర్ధిల్లుచున్నాడు.

**తా॥** చిత్తమనెడు క్రూరమైన బెబ్బులిని – ధీరమైన మనఃఖడ్గముయొక్క వాదరతో (పదును) ఖండించి – భయమన్నది లేని కాంతారమునం దొంటిగా స్వేచ్ఛావిహారియై విరాజిల్లు యోగిసత్తముడు లెక్కకొక్క డెచటనో లభించును.

**వి :** పెద్దపులి అడవులలో స్వేచ్ఛగా నిర్నిరోధముగా విహరించినట్లు – చిత్తము శబ్దాది విషయారణ్యములయందు విహరించుచుండును.

బెబ్బులి అల్పమృగములను దారుణముగ జీల్చి చెండినట్లు – చిత్తము కూడ అల్పాల్పములైన నీతివాక్యములకు ధర్మసూత్రములకు లొంగదు సరికదా! తనదారికి అడ్డువచ్చు వీనినెల్ల సంహరించును, గ్రసించి వేయును.

అభ్యాస – వైరాగ్యములచే ధీరమై – ఆత్మానాత్మవివేకముచే పదునెక్కిన మనసనెడు మహాఖడ్గముతో ఎవడో యోగివర్యుడు మాత్రము దానిని ఖండించును.

ఇచట సంహరింపబడునది చిత్తము, దానిని ఖండించు ఖడ్గము మనసు అని చెప్పబడెను. చిత్తమునకు – మనసునకును ఈషద్భేదమున్నను – అవి రెండును అంతఃకరణములోని భాగములే కదా! (మనోబుద్ధ్యహంకారముల సంపుటియే అంతఃకరణము) ఒకటి వ్యాఘ్రముకాగా – వేరొకటి ఖడ్గమై దానిని ఖండించుట ఎట్లు? అను సంశయమునకు అవకాశమున్నది. కాని –

**"మన ఏవ మనుష్యాణాం – కారణం బన్ధమోక్షయోః**
**బన్ధాయ విషయాసక్తం – ముక్త్యై నిర్విషయం మనః "**

జీవకోటి సంసారబద్ధమై కుందుటకు, మోక్షలాభముచే ఆనందించుటకు రెండింటికిని మనస్సే కారణము. అదే బంధమును దెచ్చి పెట్టును. అదే ముక్తిలాభమును గలిగించును.

విషయములవంక పరువెత్తి బంధమునకు, విషయములనుండి వెనుకకు మరలి, నిర్విషయమై ముక్తిలాభమునకును అది కారణమగుచున్నది.

వృత్తి భేదముచే చిత్తమే వ్యాఘ్రము. అదియే ఖడ్గము అగుచున్నది.

విషయాభిముఖవృత్తి చిత్తమును బెబ్బులిని జేసి భయమును (సంసారమును) దెచ్చి పెట్టుచున్నది. అపుడెవడైనను – అభ్యాసవైరాగ్యములచే ఆత్మవిమర్శచే – విషయ–పరాఙ్ముఖవృత్తిని ఆ మనస్సునందు కల్పింపగలిగెనా బెబ్బులివలె నున్న విషయాభిముఖవృత్తి మాసిపోవును. ఖండితమగును.

'**ద్వితీయాద్వై భయం భవతి**' – రెండవదున్నదని తలంచినంత వరకును భయము తప్పదు. భయమనగా సంసారము. ఈ సంసారము అడవి వంటిది. భయారణ్యమైన సంసారమునకు వ్యతిరేక మైనదగుటచే అభయారణ్యమనగా పరబ్రహ్మము.

మనసును నిర్విషయ మొనరించిన మహాత్ముడు '**ఏకమేవాద్వితీయం బ్రహ్మ**' అన్న జ్ఞానభూమికను అధిరోహించి – బంధముక్తు డగుటచే స్వతంత్రుడై – ఉన్నది తానొక్కడే అన్న అనుభవముతో విహరించును.

సాధారణులకు ఈ కార్యము సాధ్యము కాదు. ఎవడో యోగిపుంగవుడు మాత్రమే దీనిని సాధింపగలడు.



**అవతారిక :** ఇటనుండి ముప్పదిమూడవశ్లోకమువరకును శ్లేషచే రూపకముచే ఆత్మవిద్యాసంపన్నుని వైభవమును వర్ణించుచున్నారు.

**శ్లో॥ సజ్జనహృదయసరోజో–**
**న్మీలనకరధీకరప్రసరః ।**
**ఏకో యతివరపూషా**
**నిర్దోషశ్చరతి చిద్గగనే ॥ 25**

ప్ర : సజ్జన–హృదయ–సరోజోన్మీలకర–ధీకర–ప్రసరః...
సజ్జన = సత్పురుషులయొక్క,
హృదయ = మనస్సు అనెడి,
సరోజ = పద్మమును,
ఉన్మీలనకర = వికసింపజేయగల,

ధీకర = బుద్ధి అనెడి కిరణములయొక్క,
ప్రసరః = ప్రసారము కల,
ఏకః = ఒకానొక,
యతివరపూషా = యతీశ్వరుడు అను సూర్యుడు,
చిద్గగనే = చైతన్యము అనెడి ఆకాశము నందు,
నిర్దోషః = దోషములు (రాత్రులు) లేనివాడై,
చరతి = సంచరించుచున్నాడు.

**తా॥** తన బుద్ధికిరణప్రసారముచే సజ్జనుల హృత్పద్మములను వికసితమొనర్చుచు యతివరసూర్యుడు చిదాకాశమునందు అద్వయమూర్తియై విరాజిల్లుచుండును. అట్టి మహాత్ముడు అరుదుగా లభించును.

**వి : ఇంద్రియములను అదుపున బెట్టుటకై యత్నించుట, మనసుయొక్క విషయాభిముఖ-ప్రవృత్తిని నిరోధింప యత్నించుట, పరమాత్మానుభవమునకై తడవుకొనుచుండుట సజ్జన లక్షణము.**

కామక్రోధాదులు ఒక్క దుర్జనునియందు మాత్రమే కాదు, అందరి యందును (సజ్జనులయందును) ఉదయించును. తనయందు ఉదయించిన కామక్రోధాదులను సాగనిచ్చువాడు దుర్జనుడు. వానిని అరికట్టయత్నించువాడు సజ్జనుడు. మనసుయొక్క విషయాభిముఖప్రవృత్తికి స్వాగతము పలుకువాడు దుర్జనుడు. ఆ ప్రవృత్తిని విదళింప యత్నించువాడు సజ్జనుడు.

బ్రహ్మానుభవసంపన్నుడైన యోగివర్యుడు – పరమాత్మానుభవమునకై తడవుకొనుచున్న సజ్జనునకు మార్గదర్శకుడగును. (దుర్జనునకు – ఈ వాంఛయే లేదుగాన, వాడు పెద్దగా మారడు).

ఎండుకట్టె నిప్పు సోకినంతనే జ్వలించును. పచ్చికట్టెను నిప్పుల నడుమ నుంచినను పొగయే కాని జ్వాలరాదు.

సూర్యకిరణములు సోకగా పద్మము వికసించినట్లు యోగివర్యుని బుద్ధి ప్రసరించినంతనే సజ్జనహృదయము వికసితమగును.

అంతవరకు దారిదొరకక కొట్టుమిట్టాడుచున్న సజ్జనునకు యోగివర్యుని సాంగత్యము అనుగ్రహము వెలుగులు విరజిమ్మి ఆత్మానుభవమునకు మార్గదర్శక మగును.

'చిదాకాశము' అనగా జ్ఞానాకాశము అనగా బ్రహ్మమే. సంతతము చిదాకాశమున దోషరహితుడై (శరీరేంద్రియ తాదాత్మ్యము లేనివాడై) ఆత్మోపలబ్ధికై యత్నశీలురై యున్న

జనులకు వెలుగులు విరజిమ్మి హృదయవికాసము చేకూర్చగల మహాత్ముడైన యతివరసూర్యుడు దుర్లభుడు.

**శ్లో॥ కువలయవికాసకారణ-**
**మజ్ఞానధ్వాన్తకౌముదీప్రజ్ఞః ।**
**శుద్ధో మునీన్ద్రచన్ద్రః**
**సురసేవ్యే లసతి విష్ణుపదే ॥ 26**

ప్ర : కువలయ-వికాస-కారణమ్...
కువలయ = కలువపూవులయొక్క,
వికాస = వికాసమునకు,
కారణమ్ = కారణమైనవాడును,
అజ్ఞాన-ధ్వాన్త-కౌముదీ-ప్రజ్ఞః...
అజ్ఞాన = అజ్ఞానము అనెడి,
ధ్వాన్త = చీకటికి (చీకటిని పారద్రోలు),
కౌముదీ = వెన్నెల వంటి,
ప్రజ్ఞః = జ్ఞానము కలవాడును,
శుద్ధః = పరిశుద్ధుడును, అగు;
మునీన్ద్రచన్ద్రః = మునీంద్రుడు అను చన్ద్రుడు,
సురసేవ్యే = దేవతలచే ఆశ్రయించబడిన,
మునిపదే = ముని అను పదవియందు,
లసతి = విరాజిల్లుచున్నాడు.

**తా॥** కువలయ వికాసకారణమై - అజ్ఞానమను చీకటిని బారద్రోలు కౌముది (వెన్నెల) వంటి ప్రజ్ఞగలవాడై పరిశుద్ధుడైన యోగిచంద్రుడు - దేవసేవ్యమైన విష్ణుపదమున విరాజిల్లుచున్నాడు.

**వి :** ఇందలి కువలయ - కౌముదీ - విష్ణుపద శబ్దములు రెండేసి అర్థముల యందు ఉపయోగింపబడెను.

కువలయమనగా - కలువ, భూమి; కౌముది - అనగా, వెన్నెల, వ్యాకరణశాస్త్రము. విష్ణుపదమనగా - ఆకాశము, పరబ్రహ్మము.

పున్నమి నా డాకాశమున నిర్మలముగా బ్రకాశించు చంద్రబింబము - వెన్నెలలను గురియించి చీకటిని బారద్రోలి నట్లు - కలువలను వికసితముల గావించినట్లు -

యోగిసత్తముడు శుద్ధుడై (తనకంటె వేరైనదాని సంబంధము కొంచెమును లేనివాడై) పరబ్రహ్మమే తానై తేజరిల్లుచు – తన ప్రజ్ఞచే (బ్రహ్మజ్ఞానముచే) అజ్ఞానమును నివారించుచు – ఈ పుడమి కెల్ల వికాసమును గలిగించు చున్నాడు.

అట్టి యోగి సులభప్రాప్యుడు కాడు.

**శ్లో॥ స్వానన్దామృతసేకైరాన్తర–**
**సన్తాపసన్తతిం శమయన్ ।**
**చిత్రమచఞ్చలవృత్తిశ్చి–**
**ద్వ్యోమని భాతి యోగివర్యఘనః ॥ 27**

ప్ర : యోగివర్య–ఘనః...
యోగివర్య = గొప్ప యోగి అను,
ఘనః = మేఘము,
స్వానన్దామృత–సేకైః...
స్వానన్ద = ఆత్మానన్దము అనెడి,
అమృత = అమృతము యొక్క,
సేకైః = ధారలతో,
అన్తర–సన్తాప–సన్తతిమ్...
అన్తర = మనస్సులోని,
సన్తాప = బాధలయొక్క
సన్తతిమ్ = సముదాయమును,
శమయన్ = ఉపశమింపజేయుచూ,
అచఞ్చలవృత్తిః = నిశ్చలమైన చిత్తవృత్తి కలవాడు అగుచూ,
చిద్ వ్యోమని = చైతన్యము అనెడి ఆకాశము నందు,
భాతి = ప్రకాశించుచున్నాడు,
చిత్రమ్ = ఎంత ఆశ్చర్యము!

**తా॥** ఆత్మానందామృతాసేచనములచే – ఆంతరములైన సంతాపముల నెల్ల శాంతింప జేయుచు – చిదాకాశమున యతివరమేఘము అచంచలవృత్తియై విరాజిల్లుచున్నది. ఇది చిత్రము.

**వి :** మేఘము జలధారలను వర్షించును. బ్రహ్మవిద్వరేణ్యుడైన యోగివర్యుడు ఆత్మానందామృతమును వర్షించును.

మేఘము జలధారాసేచనములచే (తడుపుటచే) బయటి తాపమునెల్ల హరించి వేయును. యోగివర్యుడు ఆత్మానందధారాసేచనములచే లోపలి తాపములనెల్ల (సంసారము వలన జనించు మానసిక తాపము) హరించును.

మేఘము స్థూలాకాశమున చంచలవృత్తియై యుండును. అనగా నిరంతరము చలించు చుండును. యతివర్యుడు చిదాకాశమున స్థిరుడై యుండును.

బ్రహ్మవిద్వరుడైన యతికిని మేఘమునకును కొన్నిటి యందు పోలిక యున్నది. కాని అది బాహ్యతాపమును హరింపగా – యోగివర్యుడు అంతరసంతాపమును శమింప జేయుచున్నాడు. అది చంచలవృత్తి కాగా ఈ యతివరమేఘము అచంచలవృత్తి అగుట చిత్రము.

యతిశేఖరుడు పరబ్రహ్మము తానై యున్నానన్న తెలివి నెన్నడును విడువడు! అతడున్నచోట ఆత్మానందామృతము వెల్లివిరియును.

సాంసారికములైన తాపములచే నిరంతరము తపించు అంతరంగము ఆ మహాత్ముని సన్నిధియందు తాపరహితమై చల్లని శాంతిని అనుభవించును.



**శ్లో॥ సుమనఃసౌరభమఞ్జుల–**
**సఞ్చారనివారితాఖిలశాన్తిః ।**
**సంయమిచారుసమీరో**
**విహరత్యానన్దసంవిదారామే ॥ 28**

ప్ర : సంయమి–చారు–సమీరః...
సంయమి = యతీశ్వరుడు అను,
చారు = మనోహరమైన,
సమీరః = మెల్లని గాలి,
సుమనస్సౌరభ–మఞ్జుల–సఞ్చార–నివారితాఖిల–శ్రాన్తిః ...
సుమనస్ = పుష్పములయొక్క,
సౌరభ = సువాసల యొక్క,
మఞ్జుల = మనోహరమైన,
సఞ్చార = తిరుగాడుటలతో,
నివారిత = పోగొట్టబడిన,
అఖిల = సమస్తమగు,

శ్రాన్తిః = అలసట కలవాడగుచూ,
ఆనన్ద-సంవిదారామే = జ్ఞానానన్దస్వరూపమైన పూలతోటలో,
విహరతి = విహరించుచూ ఉన్నది.

**తా॥** పూలతోటలో విహరించి వచ్చుటే - పూలవాసనల గుబాళింపులను వెంబెట్టుకొని వచ్చిన మనోహరమారుతము - సకల ప్రాణుల అలసటను నివారించినట్లు -

సంయమీంద్రుడు దేవలోకపు పరిమళములను వెదజల్లుచు - తాను సంచరించినచోట నిఖిలజనులకు సాంసారిక తాపోపశాంతిని ప్రసాదించుచు - జ్ఞానానందమయమైన పరబ్రహ్మమున విహరించుచుండును.

**వి :** సుమనశ్శబ్దమునకు పూవులు - దేవతలు అని రెండర్థములు.

పూలతోటనుండి పూలవాసనలతో వచ్చిన గాలి మనోహరముగానుండుటయే కాక - శరీరతాపోపనోదనక్షమమై యుండును.

అటులే '**అహం బ్రహ్మాస్మి**' అన్న జ్ఞానభూమియందు నిత్యము విహరించు వాడైన సంయమీంద్రుడు కదలిన చాలును, వానివెంట దేవతలు కదలివత్తురు. అతడడుగిడిన చోట నెల్ల సాంసారికమైన తాపము చల్లారిపోవును.

అందుచే ఇచట సంయమీంద్రుడు సుమనస్సౌరభసంయుతసుందరసమీరముగా బేర్కొనబడి సర్వజనుల సాంసారిక తాపములను శాంతింప జేయువాడుగా వర్ణింపబడెను.

ఒకడొకచోటకు కదలి వచ్చినపుడు - అచటకు వాని శరీరమొక్కటియే రాదు, వాని స్వభావగుణాదులు కూడ వానిని వెంబడించి వచ్చును.

ఒక దుర్జనుడు మన సమీపమునకు వచ్చి కూర్చుండగా - మనము పైకి తెలియని అశాంతిని అనుభవించుటకు - వాని వెంట వాని దుర్భావములన్నియును వచ్చుటయే కారణము. వాని ప్రభావమే మనయందు అశాంతిని రేకెత్తించును.

అట్లే, ఒక సజ్జనుడు ఒక బ్రహ్మవిదుత్తముడు కదలి వచ్చినపుడు - వాని సద్భావము - వాని ఆత్మజ్ఞానసంపద కూడ వానివెంట వచ్చును - అపుడు మనము మనకు తెలియని ఆనందమును శాంతిని అనుభవింతుము.

అప్రస్తుతమైనను ఇచట నొకమాట! శివారాధకులై హరిని ద్వేషించువారు, విష్ణ్వారాధకులై శివుని ద్వేషించు వారును ఉన్నారు. వారు మూర్ఖులు.

శివుడనగా ఆయన బాహ్యరూపమే కాదు గదా! అంతరంగముతో గలసి కదా శివస్వరూపము! శివుని అంతరంగములో ఎవరున్నారు? హరియున్నాడు! రాముడున్నాడు! '**నారాయణప్రియమనఙ్గమదాపహారం**' నారాయణప్రియుడైన శివుని అంతరంగమున హరి నిండియున్నాడు.

కాగా ఎవరు శివునారాధించుచున్నారో – వారు హరిని ఆరాధించుచున్నట్లే? మరియు – – శివునకు ప్రీతిపాత్రమైయున్న హరిని ద్వేషించినపుడు వాడు చేయునది శివారాధన మెట్లగును?

ఇట్లే హరియును అంతరంగమున శివుడై యున్నాడు!

'బాహ్యరూపమే కాదు. అంతరంగముగూడ కదలి వచ్చును. దానిని కూడ గమనింపవలయును' అన్న సామాన్యవిషయము నెవరు గుర్తింపరో – వారికి – ఈ ద్వేషములు. అస్తు!

బ్రహ్మవిద్వరుడు సంసారతాపమును శమింపజేయు ఆత్మానందసౌరభమును వెదజల్లుచుండును.



**శ్లో॥ నిశ్శ్రేయససరసఫలే**
**నిర్మలవిజ్ఞానపల్లవమనోజ్ఞే ।**
**వీతభయే విపినతలే**
**యతిశితికణ్ఠో విభాతి కోఽప్యేకః ॥ 29**

ప్ర : నిశ్శ్రేయస–సరస–ఫలే...
నిశ్శ్రేయస = మోక్షము అనెడి,
సరస = రసముతో నిండిన,
ఫలే = పండ్లు కలదియును,
నిర్మల–విజ్ఞాన–పల్లవ–మనోజ్ఞే...
నిర్మల = స్వచ్ఛమైన,
విజ్ఞాన = విజ్ఞానము అనెడి,
పల్లవ = చిగురుటాకులతో,
మనోజ్ఞే = మనోహరమైనదియును,
వీతభయే = తొలగిన భయము కలదియును, అగు;
విపినతలే = అరణ్యప్రాంతమునందు,
కోఽపి = మాటలతో వర్ణించుటకు వీలు కాని,
ఏకః = ఒక,
యతిశితికణ్ఠః = యతీశ్వరుడు (అరణ్యం అను పక్షమున ఒక మగనెమిలి),
విభాతి = వెలుగొందుచున్నాడు.

**తా॥** నిర్మలమైన విజ్ఞానమనెడు చివురాకులతో - మనోహరమైన మోక్షమనియెడు రసవంతమైన ఫలసంపదతో విరాజిల్లియున్న - భయరహితమైన కాంతారమందు - యతివరమదమరాళము ఒంటిగా విభాసించుచున్నది.

**వి :** '**ద్వితీయాద్వై భయం భవతి**' రెండవది ఉన్నదనుకొనిన చాలును, భయము సంభవించును. భయ మనగా సంసారము. దానికి వ్యతిరేకమైనదగుటచే అభయారణ్య మనగా - బ్రహ్మము.

అద్వయజ్ఞానసంపన్నుడైన యోగీంద్రుడు - అభయారణ్యవిహారియైన మత్త మయూరముగా (నెమలి) ఇందు రూపింపబడెను.

అరణ్యమనినంతనే చెట్లు వానికి జివుళ్ళు - ఫలసంపద ఉండవలయును గదా!

ఇచట పరబ్రహ్మమును గూర్చిన పరిశుద్ధజ్ఞానమే చివురాకులుగా జెప్పబడెను. మోక్షమే ఫలముగా బేర్కొనబడెను.

చివురు ముందుపుట్టి - పూవు - పిందె - కాయ - పండు తరువాత ఏర్పడును. అటులే మొదటిది పరోక్షజ్ఞానము - తరువాతిది బ్రహ్మానుభవము.

"**అస్తి బ్రహ్మేతి చేద్వేద పరోక్షజ్ఞానమేవ తత్ ।**
**అహం బ్రహ్మేతి చేద్వేద సాక్షాత్కారస్స ఉచ్యతే ॥**" - వేదాన్తపఞ్చదశీ.

బ్రహ్మ మున్నదని తెలియుట మొదటి దశ - అది పరోక్షజ్ఞానము. తానే ఆ పరబ్రహ్మమని ఎఱుంగుట రెండవ దశ. దీనికి **సాక్షాత్కార**మని పేరు.

అందుచే ఇచట ఆత్మప్రాప్తికైన విజ్ఞానము చివుళ్ల మొత్తముగా చెప్పబడెను.

మోక్షమును రసవంతమైన ఫలముగా జెప్పినారు. లోకములోని ఫలములయందు - తొక్క - టెంక - గింజ వంటివి పారవేయదగిన పదార్థములున్నూ ఉంటాయి. కాని మోక్షఫలమట్టిది కాదు. ఇదంతయు రసమే. ఇది కేవల రసస్వరూపము. ఇందు పరిహరింప దగినది లేదు. '**రసో వై సః**' అని శ్రుతి. రసము - ఆనందము - ఆనందమే పరబ్రహ్మ స్వరూపము.

అడవియందొంటిగా నెమలి నర్తించినట్లు - కేవలానందరూపమైన పరబ్రహ్మమునందు ఎవడో భాగ్యశాలియైన **యతిశేఖరుడు** విహరింప నేర్చును; నర్తింప గల్గును.

'**శితిః కణ్ఠే యస్య సః - శితికణ్ఠః**' - కంఠమున నలుపు గలవాడు, శివుడు అని శితికంఠ శబ్దార్థము. ఇచట యౌగికార్థముచే నెమలి అను అర్థమున ఉపయోగింపబడెను. నీలకంఠ శబ్దము లేదా! అట్లే ఇదియును.



**శ్లో॥ నిస్సారభువనమరుతల-**
**ముత్సార్యానన్దసారరసపూర్ణే ।**
**వరసరసి చిన్మయేఽస్మిన్**
**పరహంసః కోఽపి దీవ్యతి స్వైరమ్ ॥ 30**

ప్ర : నిస్సార-భువన-మరుతలమ్...
నిస్సార = సారము లేని,
భువన = లోకము అనెడి,
మరుతలమ్ = ఎడారి ప్రాంతమును,
ఉత్సార్య = విడిచిపెట్టి,
ఆనన్ద-సార-సమ్పూర్ణే...
ఆనన్ద = ఆనన్దము అనెడి,
సార = సారముతో,
సమ్పూర్ణే = నిండిన,
చిన్మయే = చైతన్యముతో నిండిన,
అస్మిన్ = ఈ,
వరసరసి = శ్రేష్ఠమైన సరస్సునందు,
కోఽపి = ఒకానొక,
పరమహంసః = సన్యాసి (హంస),
స్వైరమ్ = స్వేచ్ఛగా,
దీవ్యతి = క్రీడించును.

**తా॥** నిస్సారమైన ఎడారివంటి లోకమును వీడి, ఆత్మానందరసపరిపూర్ణమైన జ్ఞాన సరోవరమునందు స్వేచ్ఛావిహారియై విరాజిల్లు **పరమహంసమూర్తి** - ఎచటనో గాని కనుల బడదు.

**వి :** ఎడారియందు ఎండమావులు చెలరేగి జలభ్రాంతిని గలిగించును. వాని నందుకొని దప్పిక తీర్చుకొనవచ్చునని పరువెత్తుటయే కాని అవి అందవు. అందు జలమున్నూ లేదు. ఈ పరువువలన దప్పిక మరింత పెరుగును.

ఈ సంసారములోని సుఖమిట్టిది. అనగా ఎండమావులను గాంచి జలమన్న భ్రాంతితో - ఇదిగో జలము! ఇక నాలుగడుగులు! అనుచు పరువెత్తి నటులే -

సంసారమున గూడ రేపు సుఖింతుము, ఈ ఒక్క సంవత్సరము గడిచెనా బాధలేదు – ఇత్యాదిగా సుఖమును భవిష్యత్తులో భావించుచు బ్రదుకంతయు గడపుటయేకాని అందుకొన్న సుఖము లేదు; అనుభవించిన హాయి లేదు, ఉండదు. సంసారము లోని సుఖమిట్టిది.

ఎవడో ప్రాజ్ఞుడు మాత్రమే ఎడారియందు నిలిచి – ఇవి ఎండమావులు, ఇది జలము కాదు, వీనికై పరువెత్తుట వ్యర్థము – అని గ్రహించి, పరువెత్తుట మాని వెనుదిరిగినట్లు –

ఎవడో జ్ఞాని విషయసుఖములనుండి విరతుడై అనగా విషయపరాఙ్ముఖుడై – ఆత్మానందరసపరిపూర్ణమైన జ్ఞానసరోవరమున విహరింప నేర్చును.

ఇచట '**పరహంస**' అను శబ్దము – 'రాజహంస – యోగీంద్రుడు' అను అర్థముల యందుపయోగింప బడెను.

ఆత్మానుభవమున – వెనుకకు నడచుటయే పురోగమనము.

'మాండూక్యము' అని ఒక ఉపనిషత్తు. మండూకమనగా కప్ప. మాండూక్యమనగా కప్పకు సంబంధించినదని సామాన్యార్థము.

ఈ శబ్దమును గూర్చి ఒక యోగివర్యుడు ఇట్లు చెప్పెను.

మాండూక్యము అనగా కప్ప నడక. కప్ప ముందుకు దూక నెంచినపుడు వెనుక కాళ్ళపై లేచి నిలచును. తరువాత దూకును. అది ముందుకు పోదలంచి తన వెనుక కదలుచున్నది. అట్లే ఆత్మానుభవము కూడ వెనుకకు నడక.

విషయములనుండి ఇంద్రియములకు – వానినుండి మనసునకు – ఇలా వెనుక వెనుకకు బోవుటయే ఇచట **పురోగమనము**.

ఆత్మప్రాప్తికైన విషయసంపద నందిచ్చుచున్న దగుటచే – ఆత్మప్రాప్తి వెనుకకు నడచుట వలన మాత్రము లభించునది యగుటచే ఇది '**మాండూక్యము**'

ఈ అర్థము ప్రాచీనులు చెప్పినది కాదు. కాని – ఇదియును సమంజసముగనే తోచుచున్నది.

కాగా విషయసుఖములు ఎండమావులలోని జలములని గ్రహించి వానివంక పరువును విరమించుట – విరమించి వెనుదిరుగుట – వెనుదిరిగి ఆత్మలాభముచే ఆనందించుట – అనునది బ్రహ్మానుభవమునకైన క్రమము.

ఈ క్రమమును అనుసరించి ఆనందసరోవరమున విహరింపగల పరమహంస ఎచటనో లభించును.



**శ్లో॥ నిఖిలాగమపల్లవితే**
**నిగమశిరస్తన్త్రశీతలోద్యానే ।**
**మధురతరమఞ్జువాచః**
**కూజన్నాస్తే యతీన్ద్రకలకణ్ఠః ॥** **31**

ప్ర : యతీన్ద్ర–కలకణ్ఠః...
యతీన్ద్ర = యతీశ్వరుడు అను,
కలకణ్ఠః = కోకిల,
నిఖిలాగమ–పల్లవితే...
నిఖిల = సమస్తములగు,
ఆగమ = వేదములచే,
పల్లవితే = చిగురుటాకులు కలదియును,
నిగమశిరస్తన్త్ర–శీతలోద్యానే...
నిగమశిరః = ఉపనిషత్తుల యొక్క,
తన్త్ర = సిద్ధాంతములు అనెడి,
శీతలోద్యానే = చల్లని ఉద్యానవనము నందు,
మధురతర–మఞ్జుల–వాచః...
మధురతర = మరింత తీపిదనము కల,
మఞ్జుల = మనోహరమైన,
వాచః = మాటలను (ధ్వనులను),
కూజన్ = కూయుచూ (పాడుచూ),
ఆస్తే = ఉన్నది.

**తా॥** ఒక చల్లని ఉద్యానము, అది అంతటను చివుళ్ళు దొడిగి యున్నది. అట్టి వనమును జేరిన కోయిల – మధుర మంజుల కుహుకుహూ నాదములను బచరించినట్లు –

వివిధశాస్త్రములచే ఉపబృంహితమైన ఉపనిషత్తంత్రమును స్వాయత్తమొనరించుకొనిన యోగిసత్తముడు మధుమయ భాషణుడై వర్తిల్లును.

**వి :** నిగమశిరస్సులనగా ఉపనిషత్తులు. అవి అద్వయబ్రహ్మానుభవమును బోధించు విషయసంపదతో విరాజిల్లుచున్నవి. అందలి విషయము సంసారతాపమును ఉపశమింప జేయునట్టిది. అందుచే అది శీతలోద్యానముగా రూపింపబడెను.

చివుళ్ళు చెట్టుకు పుష్టిని అందమును పెంచును; అట్లే వివిధశాస్త్రపరిజ్ఞానముచే

ఉపనిషదర్థము విభాసితమగును. అట్లగుటచే శాస్త్రజ్ఞానము పల్లవసముదాయముగా రూపింప బడెను.

కోకిల వాక్కు మధురము. ఉపనిషత్తంత్రారూఢుడైన యతిశేఖరుని వాక్కు మధుమయము. అందుచే యతిసత్తముడు ఇందు కలకంఠముగా రూపింపబడెను.

యతిసత్తముడు పెదవి విప్పిన చాలును, బ్రహ్మానుభవమును గూర్చి ప్రసంగించును. అతడితరము మాటాడడు.

బ్రహ్మవిద్యను గూర్చిన ప్రసంగముకంటె మధురమైనది లేదు.

లోకములో ఎన్నో వింత వింత గాథలు ఉండవచ్చును. ఆవేవియును బ్రహ్మవిద్యా ప్రసంగమువలె మధురములు కావు. అవన్నియును పరుల గాథలు. బ్రహ్మవిద్యయో? అది ఆత్మకథ! తన కథ! మన కథ!

ఆలకించిన జాలును, ఆశ్చర్యము గలిగించు గాథ! వీనుల బడిన జాలును, విపరీతమైన సంసారతాపమునెల్ల ఉపశమింపజేయు గాథ!

చెవుల బడిన జాలును, చిత్తమును స్వాయత్త మొనరించు కథ!

శ్రోత్ర కుహరముల జొచ్చిన జాలును, అజ్ఞానతిమిరము నంతరింపజేసి, ఆత్మసూర్యుని సాక్షాత్కరింపజేయు కథ!

అందుచే ఉపనిషత్తంత్రారూఢుడై యతిశేఖరుని వాక్కులు పరమమధురము లని తెలుపబడెను.

**(ఇచట 'మఞ్జువాచః' అన్నచోట – ఆకారాన్తవాచా శబ్దము ఉపయోగింపబడి పుంవద్భావము చేయబడెను. ఇది చకారాన్త వాక్ఛబ్దము కాదు).**

**శ్లో॥ దారితమోహమదేభో**
**దూరీకృతసకలదురితశార్దూలః ।**
**విబుధోత్తమసింహవరో**
**విహరత్యానన్దవితతకాన్తారే ॥ 32**

ప్ర : విబుదోత్తమ–సింహవరః...
విబుధ = పండితులలో,
ఉత్తమ = గొప్పవాడు అను,
సింహవరః = గొప్ప సింహము,

దారిత–మోహ–మదేభః...
దారిత = చీల్చి చెండాడబడిన,
మోహ–మదేభః = మదించిన ఏనుగు కలదియును,
దూరీకృత–సకల–దురీత–శార్దూలః...
దూరీకృత = దూరములో ఉంచబడిన (చెదరగొట్టబడిన),
సకల = అన్ని
దురిత = పాపములు అనెడి,
శార్దూలః= పెద్ద పులులు కలదియును, అయి;
ఆనన్ద–వితత–కాన్తారే...
ఆనన్ద = ఆనన్దముతో,
వితత = విస్తరించబడిన,
కాన్తారే = అరణ్యమునందు,
విహరతి = స్వేచ్ఛగా సంచరించుచూ ఉన్నది.

**తా॥** సువిశాలమైన ఆనందకాంతారమున – అజ్ఞానమన్న మదగజమును మట్టువెట్టి – పాపమనెడు బెబ్బులిని పలాయిత మొనరించి, జ్ఞానిసింహము సాటిలేనిదై విహరించు చున్నది.

**వి :** 'జగత్తు మిథ్యయని, బ్రహ్మ సత్యమని' –ఎవనికి నిర్ద్వంద్వముగ నిస్సంశయముగ తెలిసివచ్చెనో, తెలియుటయే కాదు, అనుభవమునకు అందెనో – అతడు **జ్ఞాని**.

కావ్య – నాటకాలంకార – శాస్త్రాదుల పరిచయ మెంత యున్నను – జగన్మిథ్యాత్వమును భావింపనివాడు, బ్రహ్మసత్యత ననుభవింపనివాడు, "**జీవో బ్రహ్మైవ నాపరః**" – అని బ్రహ్మము తానై ప్రకాశింపనివాడు జ్ఞాని అనబడడు.

ఇట్టి జ్ఞానము – బ్రహ్మజ్ఞానము ఎవనియందు ఉదయించెనో ఆతడు సింహము వంటి వాడు.

సింహము ఏనుగును – అదెంత బలము కలదైనను చీల్చి చెండి సంహరించినట్లు – జ్ఞానియైన యోగివర్యుడు – ఆత్మ యందనాత్మబుద్ధిని, అనాత్మయం దాత్మబుద్ధిని గల్పించుచు – చిరకాలము నుండియు బలపడియున్న అజ్ఞానమును సంహరించును.

మరియు సింహము బెబ్బులిని పారద్రోలినట్లు – జ్ఞానియైన యతిశేఖరుడు పాపమును పలాయిత మొనరించును.

శరీరేంద్రియతాదాత్మ్యము పాపము. పాపమే కాదు, సకలపాపములకును మూలకందము. అట్టి పాపము జ్ఞాని యందుండదు.

అందుచే జ్ఞానియైన యోగిసింహము – అజ్ఞానగజవిదారియై పలాయితపాపశార్దూలమై ఆనందకాంతారమునందనవరతము విహరించుచుండునని వర్ణింపబడెను.

**శ్లో॥ అజ్ఞానమృగవరోజ్ఝిత–**
**విజ్ఞానోత్తుఙ్గశృఙ్గశిఖరితలే ।**
**మతిసలిలశీతలాఙ్గో**
**యతివరకలభో విరాజతే విహరన్ ॥ 33**

ప్ర : అజ్ఞాన–మృగ–వరోజ్ఝిత–విజ్ఞానోత్తుఙ్గ–శృఙ్గ–శిఖరితలే...
అజ్ఞాన = అజ్ఞానము అనెడి,
మృగవర = మృగరాజు అగు సింహము చేత,
ఉజ్ఝిత = విడిచిపెట్టబడినదియును,
విజ్ఞాన = విజ్ఞానము చేత,
ఉత్తుఙ్గ = ఎత్తైనదియును అగు,
శృఙ్గ = శిఖరములు గల,
శిఖరితలే = పర్వతప్రాన్తమునందు,
మతి–సలిల–శీతలాఙ్గః...
మతి = వివేకము అనెడి,
సలిల = నీటితో,
శీతలాఙ్గః = చల్లని శరీరము కల,
యతి–మదకలభః...
యతి = సన్యాసి అను,
మదకలభః = మదించిన ఏనుగు,
విహరన్ = సంచరించుచూ,
విరాజతే = విరాజిల్లుచున్నది.

**తా॥** అజ్ఞానమనెడు మృగరాజుచే విడువబడిన – విజ్ఞానమనెడు సమున్నత శైలశిఖరమందు – ప్రజ్ఞాజలమున శీతలమైన అంగములుగల – యతివర బాలమదేభ మొందు విహరించు చున్నది.

**వి :** అజ్ఞాన మెంతవరకు నిలిచి యుండునో – అంతవరకును – ఆత్మలాభమున కుపకరించని విజ్ఞాన మెంత ఎక్కువగా నున్నను సుఖమునీయజాలదు.

సింహము వసించు కొండకొమ్ము ఎంత ఎత్తుగా నున్నను అది నిరాపదము కాదు, అభయస్థానము కాదు. అటులే అభ్యాసవైరాగ్యములచే అజ్ఞానమును (దేహాత్మభ్రాంతిని) నివారించు కొననినాడు – కేవలమైన వేదాంతగ్రంథవిజ్ఞానము నెంత పెంచుకొనినను – అది సంసారబంధమును నివారింపజాలదు.

అట్లు కేవల వేదాంతవిజ్ఞానమే సంసారభయనివారకమైనచో – వేదాంతగ్రంథ రచయితలు, ఉపనిషదుపన్యాసకులు – అందరును జీవన్ముక్తిని సాధించిన మహాపురుషుల కోటిలోనికే చేరియుందురు.

అభ్యాసవైరాగ్యములచే అజ్ఞానము పూర్తిగా తొలగిపోయిననాడు మాత్రమే – ఆత్మప్రాప్తికైన విజ్ఞానము అభయస్థానమగును.

అపుడది సింహము వీడిన సమున్నతశైలశిఖరము వంటిది.

నిర్మలాచ్ఛజలపూరమునం దవగాహనము శరీరతాపము నెల్ల హరించినట్లు – ఆత్మ విద్యాసంపన్నమైన బుద్ధి సంసారతాపము నుపశమింపజేయును.

ఒక గున్న ఏనుగు సింహము వీడిన సమున్నత శైలశిఖరమున – నిర్మలజలపూరమున నిమగ్నమగుచు – శరీరతాపమునెల్ల నివారించుకొనుచు – స్వేచ్ఛగా నిర్భయముగ విహరించినట్లు –

ఎవడో యతివరుడు మాత్రమే – అభ్యాసవైరాగ్యములచే అజ్ఞానము నివారితముకాగా – ఆత్మలాభము నొదవించు విజ్ఞానముతో నిండిన బుద్ధియందు చరించుచు (ఆత్మవిచారణ సాగించుచు) స్వతంత్రుడై (బంధము – భయము లేనివాడై) విహరింప నేర్చును.

ఇచట అజ్ఞానసింహములకు – విజ్ఞానశైలములకు – యతికలభములకు – అభేదరూపకము చేసి శ్రీసదాశివేంద్రులు ఈ మహార్థమును వివరించి యున్నారు.

కేవల వేదాంతవిజ్ఞానము ప్రయోజనకారి కాదు –

దేహాత్మభ్రాంతిని తొలగించుకొనవలయును – అని తాత్పర్యము. అట్లు కానినాడు – ఈ భ్రాంతి సింహమువలె గర్జింపగా – కూడబెట్టిన ఉపనిషద్విజ్ఞాన మెంత ఎక్కుడైనను పలాయనము చిత్తగించును.



**శ్లో॥ నాసాఞ్చలనిహితాక్షో**
**నామాదిభ్యో నివారితస్వాన్తః ।**

**తటినీతటేషు తత్త్వం**
**ధ్యాయన్నాస్తే యతిః కోఽపి ॥ 34**

ప్ర : నాసాఞ్చల–నిహితాక్షః...
నాసాఞ్చల = ముక్కు యొక్క చివరి భాగము నందు,
నిహిత = ఉంచబడిన,
అక్షః = దృష్టి కలవాడును,
నామాదిభ్యః = పేరు, రూపము, గుణము, క్రియ మొదలగు వాటినుండి,
నివర్తిత–స్వాన్తః...
నివర్తిత = వెనుకకు మరల్చబడిన,
స్వాన్తః = తన మనస్సు కలవాడును, అగు;
కోఽపి = ఒకానొక,
యతిః = సన్యాసి,
తటినీ–తటేషు...
తటినీ = నదులయొక్క,
తటేషు = తీరములయందు,
తత్త్వమ్ = పరమాత్మ తత్త్వమును,
ధ్యాయన్ = ధ్యానించుచూ,
ఆస్తే = ఉన్నాడు.

**తా॥** నాసాగ్రమున కంటిచూపును నిలిపి – నామరూపాదికమునుండి మనసును మరల్చి – నదీతీరములయం దెవడో యోగిపుంగవుడు – తత్త్వచింతనపరుడై యుండ నేర్చును.

**వి :** మనసును విషయములనుండి వెనుకకు మరల్చి ఏకాగ్రమొనరించుటకైన సాధనములలో – భ్రూమధ్యదృష్టి ప్రశస్తమైనది.

ఇదియే **నాసాగ్రదృష్టి** యనబడును. నాసా అనగా నాసిక, ముక్కు. దానియొక్క అగ్రము అనగా అది ఆరంభమగుచోటు. భ్రూమధ్యము. కొందరు అట్లుగాక నాసికయొక్క కొననే నాసాగ్రముగా భావింతురు. '**నాసాగ్రే నవమౌక్తికం**' – అదియును యుక్తమే! రెండును సమానఫలితమునే కలిగించును. రెండింటి అభ్యాసమువలన ప్రథమదశలో భ్రూమధ్యమునం దొక స్పందము (అదరు) అనుభవమునకు వచ్చును.

అసలు ఈ దృష్టులు – అమాదృష్టి – పూర్ణిమాదృష్టి – ప్రతిపద్దృష్టి – అని మూడు రకములుగా జెప్పుదురు. **అమాదృష్టి** యనగా కనులు మూసికొని నాసాగ్రమును –

భ్రూమధ్యమును భావించుట – ధ్యానించుట. కనులను దెరిచియుంచి అదే పనిని సాగించుట – **పూర్ణిమాదృష్టి**. కనులు నరమోడ్పులుగా నుంచి – నాసాగ్రముపై చూపు నిలుపుట **ప్రతిపద్దృష్టి**.

ఇట్లు కొంచెము కొంచెము భేదములతో నున్న ఈ దృష్టులయందు దేని నభ్యసించినను – భ్రూమధ్యమునందలి '**పాయనిజల్**' అను గ్రంథి చైతన్యవంతమగును. అది చైతన్యవంతమైనంతనే సాధకుడు తనదైన మానసికవ్యాపారముతో తాదాత్మ్యమును గోల్పోవును. అనగా మానసికచలనము లుండును గాని వానితో ఏకీభవించుట జరుగదు. ఏకీభవించుట లేదు గాన మనస్సుయొక్క వ్యాపారము కూడా దాదాపు పడిపోవును.

ఇద్దరు భాగస్వాములు కలిసి ఒక వ్యాపారమును ఆరంభించి సాగించుచుండిరి. అందు ఒకని పెట్టుబడి చాల ఎక్కువ. రెండవవాని పెట్టుబడి నామమాత్రము. ఇట్లుండగా ఎక్కువ పెట్టుబడి పెట్టిన భాగస్వామి – వానినుండి తన సొత్తుతో విడిపోయినాడు. అపుడాతక్కువ పెట్టుబడి వాడు ఒంటిగా వ్యాపారము నేమి నడపును. వానికి పెట్టుబడి లేదు, బలము లేదు, వానికి కాలుసేతులాడవు, అతడు వ్యాపారము సాగింపలేడు, రెన్నాళ్ళలో వాని వ్యాపారము మూతపడును. మరల కొలది పెట్టుబడితో ఇంకొకటి ఆరంభించును. అదియును ఇటులే యగును.

సరిగా ఇదే విధానము మానసికవృత్తితో – వ్యాపారముతో ఏకీభవించని వాడు – తాదాత్మ్యమును విడిచిపెట్టినవాడు – మనసుయొక్క వృత్తి నీరసించి పోవును. మనసు శిథిలమై చదికిల బడును.

భ్రూమధ్యదృష్టిని అభ్యసించిన ఉత్తమసాధకుడు తన మానసికమైన సర్వవ్యాపారమునకు సాక్షిగా (చూచువాడుగా) ఉండిపోవును.

దీనితో అతనికి తాను శరీరేంద్రియాదులకంటె వేరైనవాడ నన్నది అనుభవమునకు అంద నారంభించును. అది క్రమముగా వృద్ధి చెందును. అనుభవమునకు పరిపూర్ణత సిద్ధించును.

ఇదొక అద్భుతమైన సాధనము. ఉపనిషదర్థమును, వేదాంతవిజ్ఞానమును చక్కగా బుద్ధియందు పదిలపరచుకొని – ఈ సాధనమును అభ్యాసములో నుంచిన, దేవభూములతో సంబంధ మేర్పడును.

'తల్లి యున్నది. బిడ్డడున్నాడు. బిడ్డ మంచి ఆకలితో నున్నాడు. తల్లి బిడ్డకి కడుపు నింపుటకై తన రొమ్ము వాని నోట బెట్టినది. వాడు ఆబగా పాలు గుడుచుకొనుచున్నాడు.

ఇంతలో తల్లికి వేరే పని గుర్తుకు వచ్చి తనరొమ్మును బిడ్డనోటినుండి వెలికిదీయ యత్నించినది. వాడు తల్లి రొమ్మును వదలడు' – ఈ విషయము అందరును ఎరిగినదే.

భ్రూమధ్యదృష్టి సరిగా ఇటులే ఉండును. సాధకుడు తన అవధానమును భ్రూమధ్యమున నిలుపుచు అభ్యాసము చేయగా 'పాయనిజల్' అనెడి గ్రంథి చైతన్యవంతమై సాధకుని దృష్టిని బట్టుకొనును. కొంత ప్రయత్నించిన మీదట కాని సాధకుడు అటనుండి తనదృష్టి మార్చుకొనజాలని స్థితి వచ్చును. ఎపు డిట్టి స్థితి సంభవించెనో అపుడు సాధకుడు తనకు సరియైన కేంద్రము లభించినదనియు, గ్రంథి (యౌగికభాషలో భ్రూమధ్యచక్రము – ఆజ్ఞాచక్రము) చైతన్యవంతమైనదని నిశ్చయించుకొన వచ్చును.

ఈ దృష్టిచే భ్రూమధ్యకేంద్రము చైతన్యవంతమైన మీదట గూడ అభ్యాసము సాగింపగా – ఒక తటిల్లత – ఒక మెఱుపుదీవ – భ్రూమధ్యమునుండి సహస్రారమునకు (మాడు పట్టు లేక ముచ్చిలిగుంట) పరువెత్తిపోవుటను సాధకుడు కనులు మూసికొనియుండియు దర్శించును – అనుభవించును. దానితో వానికి దేవభూములతో సంబంధమేర్పడును. తాను చదువుకొన్న వేదాంతశాస్త్రార్థముల యాథార్థ్యము అనుభవమునకు వచ్చును.

ఈ స్థితికి చేరుకొన్నవానికి ఇదియొక వ్యసనముగా మారిపోవును. ఏకాంతమున గూర్చుండి – భ్రూమధ్యమున (నాసాంచలమున) దృష్టి నిలిపి శరీరేంద్రియములతోడి తాదాత్మ్యమును దుల్లగొట్టి ఆత్మనిష్ఠుడై యుండుటకే ఆతడు యత్నించును. శరీరేంద్రియములతోడి తాదాత్మ్యము వీడిపోవుట – ఒక అద్భుతమైన తృప్తిని – సుఖమును – ఆనందమును – హాయిని జనింపజేయును. అది వానిని అచట గట్టివేయును. [1]

**1. దీనిని గూర్చి ఎంత వివరించినను జాలదు. ఇది శివనేత్రము. ఇది తృతీయనేత్రము! సాధనచేసి దీనిని స్వాధీనమొనర్చుకొనుట సర్వసిద్ధికరము! ఇహాముత్రఫలభోగవిరాగియై సద్గురువు నాశ్రయించినవాడు దీని అభ్యాసమునకు అర్హుడు.**

నామము – రూపము రెండును అసత్యములే! 'కుండ – మూకుడు – బాన – చట్టి – డాక – ముంత' ఇట్లు మృణ్మయపాత్రల నామ –రూప భేదము లెన్ని యున్నను అవి సత్యములు కావు.

మృత్తు – మృత్తిక – అనగా మన్ను. అది ఘటశరావాదులు రూపుదాల్చుటకు పూర్వమున్నది. ఘటశరావాదులుగా నున్నపుడును ఉన్నది. అవి విధ్వస్తము లైనపుడును ఉన్నది.

ఘట శరావాది నామరూపములో! అవి మధ్యలో కొంతకాలము మాత్రము మృత్తికయందు

కల్పితము లగు చున్నవి. అందుచే అవి అసత్యములు. '**మృత్తికేత్యేవ సత్యమ్**' అని ఛాం. శ్రుతి.

అట్లే బ్రహ్మమొక్కటియే సత్యము, మాయావిలాసముగా నామరూపాత్మకమైన ఈ జగము దానియందు – అపరబ్రహ్మమునందు బొడముచున్నది, అడగుచున్నది. ఈ జగత్తు సృష్టికి పూర్వము లేదు – ప్రళయానంతరము నిలువదు. కాగా నామరూపాత్మకమైన జగము సత్యము కాదు.

బ్రహ్మపదార్థమో అది త్రికాలాబాధ్యము. యోగిపుంగవుడు నామరూపాత్మకమైన జగత్తున రమింపడు. ఏకాంతనదీతీరము లాతనికి నిత్యవిహారభూములు. అచట ఆ మహాత్ముడు తత్త్వచింతనపరుడై యుండును.

నదీతీరములు అనగా గంగా, గోదావరి, కృష్ణా, కావేరులు మాత్రమే కాదు. యోగి తన పిండాండము నందలి – నదుల తీరముల వెంట విహరించును.

నాసారంధ్రములు రెండును ఇడ పింగళ నాడుల ముఖములు. ఎడమ రంధ్రము ఇడా ముఖము. కుడి రంధ్రము పింగళాముఖము, శ్వాసక్రియకు సాధనములైన ఈ నాడులు వెన్నుపూసకు ఇరువైపుల మూలాధారము వరకు సాగినవి. వీనికి నడుమ వెన్నుయొక్క లోపలి భాగమున సుషమ్న అను నాడి యున్నది.

ఇడకు గంగయని – పింగళకు యమున యని సుషుమ్నకు సరస్వతి యని పేర్లు. '**ఇడా భాగీరథీ ప్రోక్తా పింగళా యమునానదీ.**'

యోగిచంద్రుడు ఇడాపింగళ సాయముతో సుషుమ్నా ద్వారమును దెరచి – అటనున్న కుండలినిని జాగృతము జేసి – దానివెంట భ్రూమధ్యమునకు వచ్చి అచట తన అవధానమును నిలుపును.

ఇట్లొనర్చి యాతడు తత్త్వచింతనపరుడై – దేహేంద్రియాదులనుండి తన స్వరూపమును వివేచించును. వేరు చేయును.

తత్త్వము అనగా యథార్థము. జగత్తు ఉన్నట్లు తోచుచున్నది. కాని – తత్త్వదృష్టితో జూడగా నిది మిథ్యయే! బ్రహ్మమొక్కటియే సత్యము. యతివరుడు నాసాంచలనిహితాక్షుడై ఒ – తత్త్వమును – యథార్థమును – సత్యమును అనుభవించును.

ఇట్టి మహనీయుడు పరమదుర్లభుడు.



**శ్లో॥ ఆశావసనో మౌనీ**
**నైరాశ్యాలఙ్కృతిః శాన్తః ।**
**కరతలభిక్షాపాత్ర-**
**స్తరుతలనిలయో మునిర్జయతి ॥ 35**

ప్ర : అశా-వసనః...
ఆశా = దిక్కులే,
వసనః = వస్త్రములుగా కలవాడును,
నైరాశ్యాలంకృతిః...
నైరాశ్య = ఆశలు లేకుండుటయే (వైరాగ్యమే),
అలంకృతిః = అలంకారముగా కలవాడును,
కరతల-భిక్షాపాత్రః...
కరతల = అరచేయియే,
భిక్షాపాత్రః = భిక్షాపాత్రగా కలవాడును,
తరుతలనిలయః = చెట్ల క్రింద నివసించువాడును,
మౌనీ = మౌనముగా ఉండువాడును,
శాన్తః = శాన్తి కలవాడును, అగు;
మునిః = మహర్షి,
జయతి = విరాజిల్లుచున్నాడు.

**తా॥** దిగంబరుడై - పెదవి విప్పి పలుకనివాడై - కోరికలన్నవి లేకపోవుటచే భూషితుడై - శాంతుడై - తన అరచేయియే భిక్షాపాత్రముగా - వృక్షమూలమే ఆవాసముగా అంగీకరించిన మునీంద్రు డీ సంసారమును జయించుచున్నాడు.

**వి :** వస్త్రము శరీరావరకము. శరీరమును జుట్టి యుండును. సంసారబంధ మించుకయును లేక - బ్రహ్మలీనుడైన వానికి శరీరముతో సంబంధ ముండదు. అందుచే దాని కాతడు వస్త్రాది రక్షకావరణములను ఎన్నడును కల్పింపడు. అట్టి యోగియొక్క శరీరమునకు దిక్కులే ఆవరకములగును. అందుచే యోగి **ఆశావసనుడు** - దిగంబరుడు.

ఆశయనగా - దిక్కు, కోరిక అని రెండర్థములు. నిరాశుడు అనగా - కోరికలు లేనివాడు. అట్టి వాని ధర్మము **నైరాశ్య**మనబడును.

బ్రహ్మాభిన్నుడై వర్తించు యోగికి కోర్కెలుండవు. అతడు **నిరీహుడు**. అదియే ఆతనికి అలంకారము.

**ఒకడు సంన్యాసియైయుండి ఇది కావలె - నదికావలె - ఆశ్రమము కావలె - కారు కావలె - సమ్మానము కావలె నన్నచో వాడేమి యోగి! వాడేమి సంన్యాసి! వానికంటె విషయలంపటుడైన గృహస్థు మేలు.**

నిరీహుడైన యోగి శాంతుడై యుండును.

కోరికలున్నపుడు అశాంతి తప్పదు. తాను కోరినదానిని సాధించుటకైన యత్నమున అశాంతి, ఆ యత్నమున ఆటంకములు కల్గిన అశాంతి! ఎటులో వాంచితార్థము సిద్ధించిననాడు దాని రక్షణయందశాంతి! ఇట్లు కోరికలన్నవి అశాంతికి మారుపేరు.

దేహేంద్రియతాదాత్మ్యమున్నచోట కోరికలు తొలగవు. అదిలేనిచోట నిలువవు.

కాగా యోగిపుంగవు డొకడు మాత్రమే శాంతుడు అనదగినవాడు!

అట్టివాడు తాను బిచ్చమెత్తుకొనుటకై ఒక సామాన్యమైన పాత్రనైన వాంఛింపడు. ఆకలి ఉదయించినపుడు, తమంత తాముగా ఏమైన తినుటకు బెట్టినచో - తన అరచేతినే భిక్షాపాత్రముగా ఉపయోగించును. నిజమైన యోగియొక్క వాంఛారాహిత్యము ఇంత పరాకాష్ఠకు చేరి యుండును.

అవధూతయైన యోగీంద్రుడు తనకొక ఆవాసము కావలెనని - సౌకర్యములతో తనకొక ఆశ్రమముండవలెనని ఎన్నడును వాంఛింపడు. ఏ చెట్టు మొదటనో పడియుండును. రాజప్రాసాదమైనను - వృక్షమూలమైనను ఆతనికి సమానములే!

తీవ్రవైరాగ్యసంపన్నుడైన యోగిమాత్రమే ఇట్లు వర్తింపగలడు. ఆతడు మాత్రమే సంసారమును గెలువగలడు.

---

**శ్లో॥ విజననదీకుఞ్జగృహే**
**మఞ్జులపులినైకమఞ్జుతరతల్పే ।**
**శేతే కోఽపి యతీన్ద్రః**
**సమరససుఖబోధవస్తునిస్తన్ద్రః ॥ 36**

ప్ర : విజన-నదీ-కుఞ్జగృహే...
విజన = నిర్జనమైన,
నదీ = నదీతటము నందు ఉన్న,
కుఞ్జగృహే = పొదరింటియందు,
మఞ్జుల-పులినైకమఞ్జుతరతల్పే...

మఞ్జుల = మనోహరమైన,
పులిన = ఇసుకతిన్నెలే,
ఏక = ఒకే ఒక,
మఞ్జుతర = మరింత సొంపైన,
తల్పే = పాన్పు నందు,
సమరస–సుఖ–బోధ–వస్తు–నిస్తన్ద్రః...
సమరస = సమానమైర రసము (ఆనందము) కల,
సుఖ–బోధ–వస్తు = చిదానన్ద రూప పరమాత్మ వస్తువునందు,
నిస్తన్ద్రః = ఏమరిపాటు లేని,
కోఽపి = ఒకానొక,
యతీన్ద్రః = యతీశ్వరుడు,
శేతే = నిద్రించుచున్నాడు.

**తా॥** సమరసమై – జ్ఞానానంద స్వరూపమై యున్న వస్తువునందు నిత్యజాగరూకుడైన యోగి మాత్రమే – నిర్జనమైన నదీతీరమునందలి పొదరింటినే ఇల్లుగా జేకొని, మనోహరమైన ఇసుకతిన్నెనే మెత్తని శయ్యగా గైకొని – సుఖము నిద్రింప నేర్చును.

**వి :** ప్రకారాంతరముచే నిందు గూడ '**తీవ్రవైరాగ్యముచేతనే బ్రహ్మానుభవ మని**' ఉపదేశింపబడెను.

పరబ్రహ్మమే తానన్న అనుభవమున మునిగినవాడు జనమధ్యమునం దుండగోరడు. ఏకాంతనదీతీరవాసము నెన్నుకొనును. ఆ నదులు భౌతికములు కావచ్చును. పిండాండగతము లైన ఇడా – పింగళా – సుషుమ్నా నాడీరూపమున నున్న గంగా, యమునా, సరస్వతులు గావచ్చును. రెండును కావచ్చును.

యోగియొక్క స్థూలశరీరము – బ్రహ్మాండగతముపైన నదీతీరముల నివాసము నందును – ఆత్మాభిముఖుడైన ఆతని అంతరంగము – భావదార్ఢ్యముచే ఇడా పింగళల సహకారముతో జాగృతయైన కుండలినితో ఏకీభవించి – సుషుమ్నా పథమున విహరించుచు – సబీజ – నిర్బీజ – సమాధులను అనుభవించుట యందును బ్రవృత్తములై యుండును.

ఆ నదీతీరమునం దా మహాత్ముడు – మెత్తని శయ్యమీద మేను వాల్చినటులు – ఏ ఇసుకతిన్నె మీదనో ఒడలెరుంగక (సమాధినిష్ఠుడై) పడియుండును.

సామాన్యజనులు శరీరనిష్ఠులు. యోగిపుంగవుడు ఆత్మనిష్ఠుడు. అందుచే సామాన్య జనమునకు మేను వాల్చుటకు మంచములు – పరుపులు – మెత్తలు కావలయును. బ్రహ్మవిద్యామహితుడైన యోగి, శరీరముతో లేశమును తాదాత్మ్యమును అనుభవింపక –

నిత్యసమరసమైన (హెచ్చు తగ్గు లెన్నడును లేని) జ్ఞానానందస్వరూపమైన పరబ్రహ్మము నందు నిత్యజాగరూకుడై యుండును. అతనికి ఈ మెత్తలతో – పరుపులతో బని లేదు.

'నిద్రించును – పరబ్రహ్మమున జాగరూకుడై యుండును' – అని చెప్పుట పరస్పర విరుద్ధముగా దోచును.

నిద్రయందు – సమాధియందు గూడ – ఇంద్రియవృత్తులు – మానసికవ్యాపారము వెనుకకు అడుగుపెట్టును. నిద్రయం దావృత్తులు అజ్ఞానమున విలీనములగును. సమాధియందు జ్ఞానమును జేరుకొనును.

నిద్రించుచు మేల్కొని యుండుట లేదా – మేల్కొని యుండి నిద్రించుట **సమాధి**. అందుచే ఇచట విరోధము లేదు.

యోగిపుంగవుడు జగద్విషయమున నిద్రితుడు – ఆత్మవిషయమున జాగృతుడు.

సామాన్యలోకము జాగ్రత్, స్వప్న, నిద్రావస్థల నెఱుంగును. నాల్గవదైన 'సమాధి' అను అవస్థ యోగిజనైకవేద్యము. అందుచే 'నిదురించుచు మెలుకవగా నుండుట' అని నంతనే సామాన్యలోకమునకు వింతగా విరుద్ధముగా దోచును.

చిరతరాభ్యాసముచే – తీవ్రవైరాగ్యసంవృత్తిచే మాత్రమే ఈ **తురీయావస్థ – సమాధి** అనుభవమునకు వచ్చును.



**శ్లో॥ భూతలమృదుతరశయ్యః**
**శీతలవాతైకచామరః శాన్తః ।**
**రాకాహిమకరదీపో**
**రాజతి యతిరాజశేఖరః కోఽపి ॥** **37**

ప్ర : భూతల–మృదుతర–శయ్యః...
భూతల = కఠినమగు భూతలమే,
మృదుతర = బాగా మెత్తనైన,
శయ్యః = పాన్పుగా కలవాడును,
శీతల–వాతైక–చామరః...
శీతల = చల్లని,
వాత = గాలియే,
ఏక = ఒకే ఒక,

చామరః = వింజామరగా కలవాడును,
రాకా–హిమకర–దీపః...
రాకా = పున్నమి నాటి,
హిమకర = చన్ద్రుడే,
దీపః = దీపముగా కలవాడును,
శాన్తః = శాన్తి కలవాడును, అగు;
కోఽపి = ఒకానొక,
యతిరాజశేఖరః = యతీశ్వరుడు,
రాజతి = విరాజిల్లు చున్నాడు.

**తా॥** యతిశేఖరుడైన యోగిపుంగవునకు నేలయే మెత్తని సెజ్జ. తన అంత తానుగా కదలివచ్చు చల్లనిగాలియే వింజామరము. పున్నమిచంద్రుడే దీపము! ఇట్లు ప్రకృతి సిద్ధములైన వానికంటె వేరుగా తనకై ఏమియును వాంఛింపని ఆత్మనిష్ఠుడు – బ్రహ్మలీనుడు అయిన యోగి సుదుర్లభుడు.

**వి :** పంచభూతములు సూర్యచంద్రాదులు భగవానును సృష్టి. గృహ – గ్రామ – నగరాదులు, ఆసనములు; శయ్యలు, ఆభరణములు – దుకూలములు – రథాదికములు ఈ సర్వము మానవుడు తన దేహేంద్రియసౌఖ్యమునకై భగవత్సృష్టిలోని వస్తుతతిని వినియోగించి, యత్నించి నిర్మించుకొన్నవి. ఈ నిర్మాణముల వెనుక మానవుని సంసారలంపటత్వమున్నది. అట్లు కాని నాడు వీని నిర్మాణము జరుగదు.

విషయవాంఛలే లేనిచోట – 'శయనించుటకు మెత్తని హంసతూలికాతల్పములు – చల్లగా ననుభవించుటకు వింజామరములు – రాత్రివేళ జీకటిని దొలగించి వెలుగును విరజిమ్ముటకు కాంతిమంతములైన దీపశ్రేష్ఠములు కావలెనన్న కోరిక ఎటులుదయించును?' ఇవేకాదు, ఇట్టివైన వాంఛలేవియును అవధూతయైన యోగీంద్రుని యందు తలయెత్తవు.

జీవన్ముక్తుడైన మహాపురుషుడు – లోకమున నడయాడు చున్నను – వానికిని లోకమునకును ఎంతో అంతర ముండును. లోకము శరీరబద్ధము. ఆతడు ఆత్మనిష్ఠుడు!

అతడు యదృచ్ఛాలాభసంతృప్తుడు! నిత్యసంతుష్టుడు!

**శ్లో॥ విపులశిలాతలఫలకే**
**విమలసరిద్వారిపరివృతోదారే ।**

**మన్దం మలయజపవనే**
**వాతి ప్రస్వపితి కోఽపి యతిరాజః ॥ 38**

ప్ర : విపుల–శిలాతలఫలకే...
విపుల = విస్తారమైన,
శిలాతలఫలకే = పలక వంటి శిలాప్రదేశము కలది యును,
విమల–సరిద్వారి–పరివృతోదారే...
విమల = నిర్మలమైన,
సరిద్వారి = నదీజలముతో,
పరివృతోదారే = చుట్టబడినదియు, విశాలమైనదియు, అగు ప్రదేశమునందు,
మలయజ–పవనే...
మలయజ = మలయపర్వతము నుండి పుట్టిన,
పవనే = గాలి,
మన్దమ్ = మెల్లగా,
వాతి = వీయుచుండగా,
కోఽపి = ఒకానొక,
యతిరాజః = యతీశ్వరుడు,
ప్రస్వపితి = గాఢముగా నిద్రించు చున్నాడు.

**తా॥** మలయమారుతము వీచుచుండగా – తేటనీటితో నిండి కదలుచున్న నదినడుమ నొకానొక విశాలమైన శిలాతలముపై – ఎవడో యతిశేఖరుడు నిద్రింప నేర్చును.

**వి :** 'తేటనీటితో నిండినది – నదినడుమ ఒక చదునైన పెద్దఱాయి – మందమారుతము' – ఇవి ఆ రాతిపై మేనువాల్చవలెనన్న లోభ మెవరికైనను జనింపజేయును.

కాని దానిపై బ్రహ్మలీనుడైన మహాపురుషుడు ఎంత నిశ్చింతగా శయనించునో – అంత నిశ్చింతగా సంసారబద్ధుడు శయనింపజాలడు.

ఆత్మస్వరూపము ఎరుకకు అందని వాడు – అంతటి మనోహరదేశమును జేరికూడ – సాంసారికతాపమునే అనుభవించును.

"ఓయీ! నీవు ఈలోకమున సుఖమునిచ్చు వస్తువులను సమకూర్చుకొనుటకై ఎంత యత్నించినను – ఎన్నిటిని సమకూర్చుకొనినను ఆత్మజ్ఞానసంపన్నత లేకున్న సుఖింప జాలవు. చక్కని సుఖమునందించు వస్తువుల నడుమకూడ తపించుచునే యుందువు; క్లేశమునే అనుభవించుచుందువు.

ఆత్మజ్ఞానసంపన్నుడ వైతివా, సుఖమును సమకూర్చు వస్తువులే కావలెనని లేదు. ఎచట నున్నను సుఖమునకు ఆనందమునకు వెలితి యుండదు. నీవు నిత్యానందమయుడవు.

సంసారమునుండి విరక్తుడవై ఆత్మోపలబ్ధికై యత్నింపుము. నిత్యానందమయుడవై విరాజిల్లుము – అని ఉపదేశము.

**శ్లో॥ ఆన్తరమేకం కిఞ్చిత్**
**సన్తతమనుసన్దధన్మహామౌనీ ।**
**కరపుటభిక్షామశ్న-**
**న్నటతి హి వీథ్యా జడాకృతిః కోఽపి ॥ 39**

ప్ర : ఆన్తరమ్ = తనలోపల నున్న,
కించిత్ = అనిర్వచనీయమైన,
ఏకమ్ = ఒక ఆత్మ తత్త్వమును,
సన్తతమ్ = ఎల్లప్పుడూ,
అనుసన్దధన్ = స్మరించుచూ,
మహామౌనీ = గొప్ప మౌనమును ధరించిన,
జడాకృతిః = జడుని యొక్క (అజ్ఞాని యొక్క) ఆకారమును ధరించిన,
కోఽపి = ఒకానొకడు,
కరపుట–భిక్షామ్...
కరపుట = చేయి అను దొన్నె యందు ఉన్న,
భిక్షామ్ = భిక్షను,
అశ్నన్ = తినుచూ,
వీథ్యామ్ = వీథియందు,
అటతి = తిరుగాడుచున్నాడు.

**తా॥** అన్నిటికిని లోనిదైన వస్తువు నెద్దానినో సంతతమును ధ్యానించుచు, మౌనియై – కరతలభిక్షాశనుడై – జడునివలె వీథులయందు బర్యటించు మహాత్ములు అరుదుగా నుందురు.

**వి :** శరీరముకంటె ఇంద్రియములు – వానికంటె మనస్సు – దానికంటెను బుద్ధి – లోపలివి. కాగా – దానికిని లోపలిది ఆత్మవస్తువు, పరబ్రహ్మము.

పొయ్యిమీద గిన్నె – గిన్నెలో నీరు – నీటిలో బియ్యము, బియ్యము ఉడికెను. ఎట్లు ఉడికెను? వేడి ఎటనుండి లభించినది?

నీటినుండి లభించినది. నీటికి వెచ్చదనము సహజగుణమా? కాదు, గిన్నెనుండి ఉష్ణశక్తి నీటికి చేరినది. గిన్నెకును వేడిమి సహజగుణము కాదు. సహజోష్ణమైనది అగ్ని మాత్రమే.

తత్సామీప్యముచే గిన్నెకు – దానిద్వారా నీటికి – నీటినుండి బియ్యమునకు ఉష్ణధర్మము సంక్రమించినది.

అట్లే పరమాత్మ సామీప్యముచే బుద్ధి చైతన్యవంత మగుచున్నది. ఆ చైతన్యమే మనసునకు ఇంద్రియములకు, దేహమునకు సంక్రమించుచున్నది.

ఈ సత్యమును పామరుడు గుర్తింపడు. గుర్తించిన ప్రాజ్ఞుడు – దేహేంద్రియాదులు స్వస్వ కర్మములయందు విచేష్టితము లగుచుండగా – వీనిని లక్షింపగ ఈ అన్నిటికిని కారణమైన వస్తువునందు ధ్యానము నిలుపును.

చెవి ఆలించుచున్నది. కన్ను చూచుచున్నది. ప్రాజ్ఞుడు ఆ వినబడు శబ్దమును, ఈ కనబడు దృశ్యమును భావింపడు. ఆ శబ్దమును ఆలకించుటకు, ఈ దృశ్యమును దిలకించుటకు ఉపకరణములై యున్నా శ్రోత్ర – నేత్రములనుగూడ లక్షింపడు. వీని వెనుక పని సేయుచున్న అంతరంగమును గూడ గమనింపడు. ఏ చైతన్యసామీప్యముచే ఈ శ్రవణదర్శనాది కార్యములు జరుగుచున్నవో – ఆ చైతన్యమును – ఆత్మవస్తువును – భావించును, ధ్యానించును.

శరీరేంద్రియాదులయొక్క చలనము లన్నియును ప్రాజ్ఞునకు బ్రహ్మానుధ్యానమున దోహదకారులే. ఏ శరీరేంద్రియచలనములు సామాన్యునకు సంసారమును దెచ్చిపెట్టుచున్నవో – – అవే చలనములు ప్రాజ్ఞునకు పరమాత్మను సాక్షాత్కరింపజేయును.

అందుచే బ్రహ్మలీనుడైన యోగి సదా పరధ్యానములో నుండును. తత్త్వమెరుంగని లోక మట్టివానిని జడుడుగా భావించుటలో ఆశ్చర్యము లేదు.

పరమాత్మను ధ్యానించుచు దేహేంద్రియాదులకు దవ్వై యున్నవాడు ఎవరితో ఏమి మాటాడును! కాగా బ్రహ్మవిద్వరుడు మౌని!

అట్టివాడు తన శరీరరక్షణమునకై ఏమియును యత్నింపడు. సంగ్రహింపడు, ఎవరైన తమంతదామై ఏమైన పెట్టిన తన చేతితో దానిని గ్రహించునే కాని – వానియొద్ద భిక్షాపాత్ర కూడ ఉండదు.

అట్టి మహాపురుషుడు శరీరముచే వీథులలో విహరించు గాక! కాని అతడు సదా బ్రహ్మము తానై బ్రహ్మము నందే విహరించును. ధన్యతముడైన ఇట్టి యోగీంద్రుడు సుదుర్లభుడు.



**శ్లో॥ ప్రవిలాప్య జగదశేషం**
**పరిశిష్టాఖణ్డవస్తుపరతన్త్రః ।**
**ప్రాశ్నాతి కబలమాస్యే**
**ప్రాప్తం ప్రారబ్ధకర్మణా కోఽపి ॥ 40**

ప్ర : కోఽపి = ఒకానొక యోగి,
అశేషమ్ = సమస్తమగు,
జగత్ = ప్రపంచమును,
ప్రవిలాప్య = లయము చేసి (మిథ్యాభూతముగా నిర్ణయించి),
పరిశిష్టాఖణ్డవస్తు–పరతన్త్రః...
పరిశిష్ట = మిగిలిన,
అఖణ్డవస్తు = ఆత్మ స్వరూపమగు అఖణ్డపదార్థమునకు,
పరతన్త్రః = అధీనుడై,
ప్రారబ్ధ–కర్మణా = ప్రారబ్ధకర్మ చేత,
ప్రాప్తమ్ = పొందబడిన,
కబలమ్ = ముద్దను,
ఆస్యే = నోటియందు ఉంచుకొని,
ప్రాశ్నాతి = భుజించు చున్నాడు.

**తా॥** సమస్తమైన జగత్తును – అనగా భూతపంచకమును ఒకదానియం దొకటి విలీన మొనరించి (11వ శ్లోకమున జెప్పినట్లు) సర్వకారణకారణముగా మిగిలియున్న అఖండ పరబ్రహ్మవస్తువున నిలచినవాడై యతిశేఖరుడు ప్రారబ్ధకర్మమువలన సంప్రాప్తమైన తన యత్నములేకయే నోటికి అందివచ్చిన ఆహారమును భుజింపుచు వర్తిల్లును.

**వి :** పంచమహాభూతములను విపరీతక్రమమున ఒకదానియందు వేరొకదానిని విలీన మొనర్చు విధానమును గూర్చి 11వ శ్లోకమున వివరింప బడెను.

కారణభిన్నమైన కార్యముండదు. అనగా ఏ కార్యమును తత్కారణముకంటె వేరైనది కాదు. కారణమందే కార్యము కల్పితమగుచున్నది.

కారణము – నిమిత్త – ఉపాదాన భేదములచే రెండు రకములు. కుండయున్నది. అది నిర్మిత మగుటయందు – కుమ్మరి, వాని సారె (చక్రము) మొదలగునవి **నిమిత్తకారణములు**. దానియం దంతటను వ్యాపించియున్న మృత్తు (మట్టి) **ఉపాదానకారణము**. దేనితో ఒక వస్తువు నిర్మితమగు చున్నదో దానిని ఉపాదాన కారణము అందురు.

సాధారణముగా నిమిత్తోపాదాన కారణములు వేరుగా నుండును. కాని కొన్నిచోట్ల నిమిత్తకారణమే ఉపాదానకారణ మగుచుండును.

సాలె గూడున్నది. దాని నెవరు నిర్మించుచున్నారు? సాలెపురుగే దానిని నిర్మించు చున్నది. అందుచే ఆ పురుగు దాని నిర్మితియందు నిమిత్తకారణ మగుచున్నది. ఆ గూడు దేనితో నిర్మితమగుచున్నదో అదికదా ఉపాదానకారణము! అది సన్నని దారములతో నిర్మితమగుచున్నది. అయితే ఆ దారములను ఆ సాలెపురుగు ఎటనుండియో తీసికొని రాలేదు. ఆ దారములు దానినుండియే పుట్టినవి. ఈ కారణముచే సాలెగూడు నిర్మాణములో ఉపాదానకారణము గూడ సాలెపురుగే!

ఇటులే ఈ జగన్నిర్మాణమున పరమాత్మయే నిమిత్తోపాదాన కారణములుగా నున్నాడు. "**తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్**" – అని శ్రుతి. (దానిని సృజించి దానియందే ప్రవేశించెను.)

సాలెగూడును నిర్మించినది సాలెపురుగు. ఆ దారములు సాలెపురుగునుండియే వచ్చినవి. ఇట్లు నిర్మితమైన గూటి నడుమ సాలెపురుగే నివసించుచున్నది.

ఇదే విధమున పరమాత్మ తానే నిమిత్తోపాదానకారణములై ఈ జగమును నిర్మించి దీనియందు దాను వసించుచున్నాడు.

భూమికి జలము, జలమున కగ్ని, దానికి గాలి, దానికి ఆకాశము కారణములు కాగా – ఆకాశము పరమాత్మ నుండి పొడముచున్నది. ఇట్లు అది సర్వకారణకారణము. ఆ పరమాత్మకు కారణము లేదు.

దేనికి కారణమున్నదో దానికి ఉత్పత్తి లయము ఉండును. దేనికి ఒక కారణము లేదో అది అనాది అనంతము. అనాద్యనంతవస్తువన్నను కారణరహితమైన వస్తువన్నను ఒక్కటే. "**యోగీంద్రుడు సర్వజగత్తును పరమకారణమైన పరమాత్మయందు విలీన మొనరించి దానియందు నిలుచును**" – అని చెప్పబడెను.

అచట నిలుచుట అన్నది కూడ లేదు. అన్నిటిని పరమకారణవస్తువునందు (బ్రహ్మమును) విలీన మొనరించు వేళ – తాను కూడ దానితోబాటు అందు విలీనమై పోవును. ఈ విలీనస్థితియే పరమాత్మయందు నిలుచుటగా జెప్పబడెను.

అట్టి యోగిపుంగవునకును శరీరముండును. అతనికి శరీరమేల నిలిచియున్నది? అనగా కర్మవశమున నిలిచి యున్నది యని సమాధానము.

కర్మము '**ప్రారబ్ధము – ఆగామి – సంచితము**' అని మూడు రకములు. విలుకాడు ఒక బాణమును వదలి వేరొక దానిని చేతబట్టి – మరికొన్ని అమ్ములపొదిలో పూని యున్నట్లు ఈ కర్మములుండును.

వదలిన బాణమువంటిది **ప్రారబ్ధము.** (ప్ర+అరబ్ధము) చేతబట్టియున్న బాణము వంటిది **ఆగామి.** అమ్ములపొది యందున్న బాణముల వంటిది **సంచితము.**

చేతిలో నున్న బాణమును, అమ్ములపొదిలోని వానిని ప్రయోగింపకుండ ఉండగలము. కాని వదలిన బాణమును నిలుపగలమా? అది తన లక్ష్యమును జేరి తీరును. అందుచే '**అనుభవముచే గాని ప్రారబ్ధకర్మము నశింపదు**' అని నారు. "**ప్రారబ్ధం భోగతో నశ్యేత్!**" ఏ కర్మఫలానుభవమునకై ఈ శరీర మేర్పడినదో – ఆ కర్మానుభవము సమాప్తము కానిదే ఈ శరీరము తొలగదు. ఆగామి సంచిత కర్మఫలములను అనుభవింపకుండ నివారించుకొన వచ్చును. ప్రారబ్ధకర్మఫలము నివారించుట వీలుకాదు.

యోగిపుంగవుడు తన కడుపు నింపుకొనుటకై తానేమియును యత్నింపదు. ప్రారబ్ధ కర్మవశమున ఎవడో వచ్చి తన నోరు దెరచి – ఏమైన ఆహారము నోటిలో బెట్టిన దానిని మ్రింగును. అంతే!

క్షుత్పిపాసల ఆధిక్యమును ఎవరు సహింపగలరు? యోగి మాత్రము ఎట్లు సహించును? అన్న శంక పుట్టుచున్నది.

క్షుత్పిపాసలు శరీరధర్మములు, యోగికి శరీరముతో సంబంధము లేదు. అందుచే క్షుత్పిపాసలు శరీరముతో తాదాత్మ్యముగల లోకమును బాధించునే గాని, దేహేంద్రియ విలక్షణుడై ప్రకాశించు యోగిని ఏమియును చేయజాలవు. అని సమాధానము.

మరియును – "**కంఠకూపే క్షుత్పిపాసా నివృత్తిః**" అని పాతంజలయోగసూత్రము. విశుద్ధచక్రస్థానమైన కంఠదేశమున సంయమము సాధించిన వానికి ఆకలి దప్పులుండవు – అని పతంజలి చెప్పిన మాట. అట్టివానికి సూర్యకిరణములనుండియే శరీరపోషణమునకైన ప్రాణశక్తి లభించును. మహాయోగులకు ఈ ప్రక్రియ తనంతతానుగా సిద్ధించును. అందువలన యోగి ఆహారాన్వేషణ మొనరింపదు.

ఇట్టి యోగీంద్రుడు లోకమునందుండ వచ్చును గాని వాని దర్శనము సులభము కాదు.

**శ్లో॥ నిన్దతి కిమపి న యోగీ**
**నన్దతి నైవాపరం కిమప్యన్తః ।**
**చన్దనశీతలహృదయః**
**కన్దలితానన్దమన్థరః స్వాస్తే ॥ 41**

ప్ర : యోగీ = యతీశ్వరుడు,
కిమపి = ఏ వస్తువును,

న నిన్దతి = నిందించడు,
అపరమ్ = వేరొక,
కిమపి = ఏ వస్తువును గురించి,
అన్తః = తన మనస్సు లోపల,
నైవ నన్దతి = ఆనందించడు.
చన్దన–శీతల–హృదయః...
చన్దన = మంచి గంధము వలె,
శీతల = చల్లని,
హృదయః = హృదయము లవాడై,
స్వాన్తే = తన మనస్సులో,
కన్దళితానన్ద–మన్దరః...
కన్దలిత = మొలకెత్తిన,
ఆనన్ద = ఆనన్దముతో,
మన్దరః = మెల్లనైన వాడుగా (ప్రశాన్తచిత్తుడుగా), (మన్థరః)
(ఆస్తే = ఉన్నాడు.)

**తా॥** యోగిపుంగవు డెవనిని నిందింపడు; స్తుతింపడు. అతని మనమునందు నిందాస్తుతులు ఉదయింపవు. ఆ మహాపురుషుడు – చందనమువలె చల్లని హృదయము గలవాడై – మోసులెత్తిన ఆనందముచే బరవశుడై – మంథరవృత్తియై సుఖముండును.

**వి :** మనసులో ద్వేషముదయించిన నిందించుట, శ్రద్ధా గౌరవము లుదయించిన స్తుతించుట సంభవించును.

ఆత్మనిష్ఠుని మానసము నిర్వికారముగ నుండును. అందుచే ఆత దపకారిని సైతము నిందింపడు. ఎంతటి మహోపకారినైనను వినుతింపడు.

కాషాయములు గట్టియు – నిందాస్తుతుల పరిధియందే యున్నవానికి బ్రహ్మానుభవము సిద్ధింపలేదన్నది నిశ్చయము.

భౌతికమైన లక్ష్య మెవనిని బలముగా ఆకర్షించుచున్నదో – వాని నడకలో వేగము, చేతలో బలము, మాటలో ఒక క్రమము ఉండును. పరధ్యానమునం దున్న వాని మనోవాక్కాయములు భౌతికలక్ష్యములచే ఆకృష్టములు కావు. పరధ్యాన మనగా బ్రహ్మానుభవము.

ఉబుకుచున్న ఆనందముచే బరవశుడైన యోగియొక్క శరీరేంద్రియాదులు తమ అంత తాము ఏదో కదలుచుండును. వానితో నాతనికి తాదాత్మ్యముండదు. అందుచే అతని శరీరేంద్రియవృత్తులయందు వేగము లోపించును.

అత డానందమయుడు! బ్రహ్మమయుడు!

---

**శ్లో॥ సన్త్యజ్య శాస్త్రజాలం**
**సంవ్యవహారం చ సర్వతస్త్యక్త్వా ।**
**ఆశ్రిత్య పూర్ణపదవీ-**
**మాస్తే నిష్కమ్పదీపవద్యోగీ ॥ 42**

ప్ర : శాస్త్రజాలమ్ = శాస్త్రముల సముదాయమును,
సన్త్యజ్య = బాగుగా విడిచిపెట్టి,
సంవ్యవహారం చ = లోకవ్యవహారములను,
సర్వతః = పరిపూర్ణముగా,
త్యక్త్వా = విడిచిపెట్టి,
పూర్వపదవీమ్ = తన పూర్వస్థానమగు ఆత్మస్వరూపమును,
ఆశ్రిత్య = ఆశ్రయించి,
యోగీ = యోగి,
నిష్కమ్పదీపవత్ = కదలికలులేని దీపమువలె,
ఆస్తే = నిశ్చలముగా ఉండును.

**తా॥** యోగికి శాస్త్రముతో బనిలేదు; లోకముతో వ్యవహారముండదు. రెండింటిని అతడు విడిచిపెట్టును: పరిత్యజించును. సర్వతః పూర్ణమైన పరబ్రహ్మము నాశ్రయించి – (అందు విలీనుడై) నిష్కంపదీపమువలె విరాజిల్లును.

**వి :** చీకటిరాత్రి – కాలినడక – తోటలలో ప్రయాణము – సంభవించినపుడు వెనుకటి రోజులలో – కాగడా చేతబట్టి – లేదా కొబ్బరి ఆకులవంటివి వెలిగించి – ఆ మంటవెలుగులో దారి చూచుకొనుచు వెళ్ళెడివారు. ఇట్టివానికి ఉల్కాహస్తుడు, (ఉల్క – కాలుచున్న కఱ్ఱ; చేతియందు గలవాడు) అని పేరు. వానికి గమ్యము చేరువరకు మాత్రమే ఉల్కతో బని. దానిని ఆరిపోకుండ – చక్కగ వెలుతురు ప్రసరించునట్లు రక్షించు కొనుట గమ్యము చేరువరకు మాత్రమే అవసరము. గమ్యము చేరిన మీదట గూడ దానిని చేత ధరించి వర్తిల్లడు. ఒకచో బారవేయును. దానిని బట్టించుకొనడు.

అట్టిదే శాస్త్రము. అజ్ఞానమన్న కారుచీకటిలో పయనించుచున్న వానికి శాస్త్రమన్న దివ్వె అవసరము. జ్ఞానసూర్యుడుదయింపగా ఆ దివ్వెతో అక్కర తీరిపోవును.

అజ్ఞానము నివారితమై బ్రహ్మానుభవము సిద్ధించిన వానికి శాస్త్రముతో నేమి పని?

శాస్త్రవిజ్ఞానము మేడ మెట్ల వంటిది. మేడ పై భాగము వంటిది బ్రహ్మానుభవము – మేడపై భాగమును జేరుకొన్న వాడు మెట్లవరుసను లక్షింపడు. ఆత్మానుభవసంపన్నతకై శాస్త్రము. అది లభింపగా శాస్త్రము – ఇల్లు ఊడ్చిన తరువాత చీపురు వంటిది. అది విసర్జింపబడును.

గాలిసోకగా దీపము చలించును. ప్రాపంచికవాసనాజాలముచే చిత్తము చలించును. ఆ వాసనలకు దూరముగా బ్రహ్మము తానై యున్న యోగి నిష్కంపదీపమే!

---

**శ్లో॥ తృణపఙ్కచర్చితాఙ్గ–**
**స్తృణమివ విశ్వం విలోకయన్ యోగీ ।**
**విహరతి రహసి వనాన్తే**
**విజరామరభూమ్ని విశ్రాన్తః ॥ 43**

ప్ర : తృణ–పఙ్క–చర్చితాఙ్గః...
తృణ = గడ్డి తోనూ,
పఙ్క = బురదతోనూ,
చర్చిత = పూయబడిన,
అఙ్గః = శరీరము కలవాడై,
విశ్వమ్ = ప్రపంచమును,
తృణమివ = గడ్డిపోచవలె,
విలోకయన్ = చూచుచు,
యోగీ = యోగి,
విజరామర–భూమి–విశ్రాన్తః...
విజర = ముసలితనము లేని,
అమర = చావు లేనిదియును అగు,
భూమి = ఆత్మ స్వరూపమునందు,
విశ్రాన్తః = విశ్రమించుచున్నవాడగు,
యోగీ = యోగి,

వనాన్తే = అడవి మధ్యలో,
రహసి = ఏకాన్తము నందు,
విహరతి = విహరించును.

**తా॥** బురదతో – పెంటతో నిత్యమలిన శరీరియై యుండి కూడ యోగి – ఈ సకల విశ్వము నొక గడ్డిపరకగా జూచును. ఏకాంత రహస్య దేశమునందున్న వాడై – జరామరణ రహితమైన పరబ్రహ్మమున నిత్యవిహరణ శీలియై – విశ్రాంతుడై యొప్పారును.

**వి :** మాలిన్యముచే అట్టకట్టిన – ధూళిధూసరమై తృణశకములంటియున్న దేహము, ఎవనికైనను చీదర పుట్టించును. స్వచ్ఛజలస్నానము చేసినగాని వానికి సుఖముగా నుండదు.

మహాయోగియందు శరీరము తానన్న భావము లేశమును మిగిలియుండదు. అందుచే అతడు శరీర మెంత బురద బురదగానున్నను పట్టించుకొనడు. దానికి శుభ్రతను గల్పింప యత్నింపడు.

చూడగా నింత నిర్ధనుడు. కాని అత డీవిశ్వమున కేమియు విలువ నీయడు. దీని నొక గడ్డిపరకగా జూచును. జరామరణములు లేని – పునరావృత్తిరహితమైన నిత్యసత్యవస్తువు నెన్నడు నెడబాయక విశ్రాంతుడై చెలగు ఆ మహాపురుషుడు –

జరామరణములన్న సుడిగుండమున జిక్కి, మునుగుచు, దేలుచు – ఉక్కిరిబిక్కిరి యగుచున్న విశ్వమును గడ్డిపరకగా జూచుటలో ఆశ్చర్య మేమున్నది?

---

**శ్లో॥ పశ్యతి కిమపి న రూపం**
**న వదతి న శృణోతి కిఞ్చిదపి వచనమ్ ।**
**తిష్ఠతి నిరుపమభూమని**
**నిష్కామవలమ్బ్య కాష్ఠవద్యోగీ ॥** **44**

**ప్ర :** యోగీ = యోగి,
కిమపి = ఏ విధమైన,
రూపమ్ = ఆకారమును,
న పశ్యతి = చూడడు,
కిఞ్చిదపి = ఏ విధమైన,
వచనమ్ = మాటను,
న వదతి = పలుకడు,
న శృణోతి = వినడు.

నిరుపమ–భూమని...
నిరుపమ = సాటిలేని,
భూమని = గొప్పదనము కల ఆత్మ యందు,
నిష్ఠామ్ = నియమమును,
అవలమ్బ్య = స్వీకరించి,
కాష్ఠవత్ = కట్టెవలె,
తిష్ఠతి = ఉండును.

**తా॥** యోగి దర్శనశ్రవణభాషణాదులకు దూరుడై యుండును. అత దేమియును దిలకింపడు. ఏమియు ఆలకింపడు. ఏమియును మాటాడడు.

సాటిలేని పరబ్రహ్మ వస్తువునందు నిష్ఠగలవాడై కాష్ఠమువలె నిశ్చలుడై విరాజిల్లును.

**వి :** మనస్సు విషయాసక్తము కానపుడు కన్ను తెరచి యున్నను రూపదర్శనము కాదు. చెవులు మూసుకొనక పోయినను శబ్దము గ్రహింపబడదు. ఏ ఇంద్రియమైనను మనస్సు విషయాభిముఖమైనపుడు మాత్రమే క్రియాశీల మగును. విషయగ్రహణము చేయును.

అట్లు కాని నాడు 'ఆఫీసు తెరచియున్నది కాని పని చేయుట లేదు' అని నటులుండును.

బ్రహ్మనిష్ఠుడైన యోగికి విషయానుభవ మెట్లు కలుగును? మహారాష్ట్రములోని భూకంపమును అస్సాములో నున్న వా డెటు లనుభవించును?

రూపదర్శన – శబ్దశ్రవణ – వాక్సంభాషణాదికము ఇంద్రియనిష్ఠునియందు సంభవించును. అద్వితీయపరబ్రహ్మమునం దత్యంతము నిమగ్నుడైన యోగి కట్టెవలె చలనము లేనివాడై విరాజిల్లును.

'**యస్య త్వస్య సర్వమాత్మైవాభూత్ – తత్కేన కం పశ్యేత్**' – అని శ్రుతి. సర్వమును ఆత్మస్వరూపమే అని ఎవనికి విదితమైనదో – అనుభవమున కందినదో – వాడు దేనితో జూచును? దేనిని దర్శించును? చూచుచున్నది – చూడబడుచున్నది ఆత్మభిన్నములు కావు కదా! కాగా యోగి శబ్దస్పర్శరూపాదికము ననుభవింపడు – తననే తాననుభవించును.

---

**శ్లో॥ జాత్యభిమానవిహీనో**
**జన్తుషు సర్వత్ర పూర్ణతాం పశ్యన్ ।**
**గూఢం చరతి యతీన్ద్రో**
**మూఢవదఖిలాగమార్థతత్త్వజ్ఞః ॥ 45**

ప్ర : అఖిలాగమార్థ–తత్త్వజ్ఞః...
అఖిల = సమస్తమైన,
ఆగమార్థ = వేదార్థముల యొక్క,
తత్త్వజ్ఞః = తత్త్వమును తెలిసిన,
యతీన్ద్రః = యతీశ్వరుడు,
జాత్యభిమానవిహీనః= నేను గొప్ప కులమునందు జన్మించాను అను అభిమానము విడిచిపెట్టిన వాడై,
సర్వత్ర = సమస్తములైన,
జన్తుషు = ప్రాణులయందు,
పూర్ణతామ్ = పరిపూర్ణమైన ఆత్మను,
పశ్యన్ = చూచుచు,
మూఢవత్ = అజ్ఞానివలె,
గూఢమ్ = రహస్యముగా,
చరతి = సంచరించుచున్నాడు.

**తా॥** యోగికి జాత్యభిమాన ముండదు. సర్వప్రాణుల నాతడు బ్రహ్మముగానే దర్శించును. సకలశాస్త్రార్థరహస్యముల నెరింగినవాడై కూడ – అజ్ఞ జనము మూఢు డీతడని భావించునట్లు నిగూఢవృత్తియై చరించును.

**వి :** 'జన్మనా జాతిః' – పాణినీయము. పుట్టుకచే జాతి ఏర్పడుచున్నది. పుట్టునది శరీరమే కాని ఆత్మవస్తువు కాదు. దానికి జననమరణములు లేవు.

**'న జాయతే మ్రియతే వా కదాచిత్ ।**
**నాయం భూత్వా భవితా వా న భూయః ॥"** అని గీత.

శరీరనిష్ఠులకు జాత్యభిమాన ముండును. బ్రహ్మనిష్ఠుడు – వీడు బ్రాహ్మణుడు – వీడు శూద్రుడు అన్న జాతిభేదమును భావించుచు – వీడు నావాడు, వీడు పరుడు – అన్న అభిమానద్వేషాదులకు నిలయుడై వర్తింపడు.

ఆతడు శరీరము నెన్నడును లక్షింపడు. సర్వమునందును పరబ్రహ్మమునే దర్శించును.

శ్లో॥ **'శుని చైవ శ్వపాకే చ పణ్డితాస్సమదర్శినః'** – గీత.

పుట్టుగ్రుడ్డి పున్నమిచంద్రుని సౌందర్యము నేమి అనుభవింపగలడు? అజ్ఞజనము ప్రాజ్ఞుడైన యోగీంద్రుని చర్యల నేమి గమనింపగలరు? వారాతని నొక మూఢునిగా

భావింతురు. ఆ యోగికి మానావమానములు సమానములు. పైగా లోకమాతనిని మూఢునిగా భావించుట ఆతనికి మహాలాభము. అతని ఏకాంతమునకు భంగముండదు.

యోగి సర్వజ్ఞుడై యుండియు మూఢునివలె గన్పట్టును!

**శ్లో॥ ఉపధాయ బాహుమూలం**
**పరిధాయాకాశమవనిమాస్తీర్య ।**
**ప్రస్వపితి విరతివనితాం**
**పరిరభ్యానన్దపరవశః కోఽపి ॥ 46**

ప్ర : బాహుమూలమ్ = మోచేయి ని,
ఉపధాయ = దిండుగా చేసికొని,
ఆకాశమ్ = ఆకాశమును,
పరిధాయ = దుప్పటిగా కప్పుకొని,
అవనిమ్ = భూమిని,
ఆస్తీర్య = పరుపుగా చేసికొని,
విరతి-వనితామ్ = వైరాగ్యం అను స్త్రీని,
పరిరభ్య = కౌగలించుకొని,
ఆనన్దపరవశః = ఆనందపరవశుడై,
కోఽపి = ఒకానొక యోగి,
ప్రస్వపితి = గాఢముగా నిద్రించు చున్నాడు.

**తా॥** యోగి తన చేతినే తలగడగా జేసికొని ఆకాశమునే కట్టుబట్టగా గైకొని - భూతలమునే మృదుతల్పముగా జేకొని - వైరాగ్యమన్న ప్రియురాలిని గాఢము కౌగిలించుకొని ఆనందపరవశుడై యుండును.

**వి :** ధరించుటకు చక్కని వస్త్రములు, శయనించుటకు హంసతూలికాతల్పములు, తలక్రిందకు మెత్తని దిండ్లు - ఇత్యాదులపై కోరిక శరీరనిష్ఠునకు - ఆత్మనిష్ఠునకు వీనితో బనిలేదు.

విషయాసక్తుడు ప్రియాపరిష్వంగమున బరవశించును. యోగికి తీవ్రవైరాగ్యమే ప్రియురాలు. ఆతడు వైరాగ్యమునే గాఢము హత్తియుండి ఆనందపరవశు డగును.

లోక మనుభవించునది విషయానందము! యోగి అనుభవించునది బ్రహ్మానందము! అది సీమితము! ఇది నిస్సీమము! అది నశ్వరము! ఇది శాశ్వతము.

**శ్లో॥ గతభేదవాసనాభిః**
**స్వప్రజ్ఞోదారవారనారీభిః ।**
**రమతే సహ యతిరాజ-**
**స్త్రయ్యన్తాన్తఃపురే కోఽపి ॥ 47**

ప్ర : గత-భేదవాసనాభిః...
గత = పోయిన (విడిచి పెట్టబడిన),
భేదవాసనాభిః = భేదవాసనలు కల,
స్వప్రజ్ఞోదార-వారనారీభిః...
స్వప్రజ్ఞః = ఆత్మజ్ఞానము అనెడి,
ఉదార = అందమైన,
వారనారీభిః సహ = వారకాన్తలతో కూడి,
త్రయ్యన్తాన్తఃపురే = ఉపనిషత్తులు అనెడి అంతఃపురములో,
కోఽపి = ఒకానొక,
యతిరాజః = యతి రాజు,
రమతే = క్రీడించు చున్నాడు.

**తా॥** భేదమునెన్నని సొగసుకత్తెలైన వెలయాండ్రతో రాజు తన అంతఃపురములో రమించినట్లు - యోగీంద్రుడు జాతిభేదమును విషయవాసనలను విసర్జించి, బ్రహ్మానుసంధానపరములై రమణీయములైన బుద్ధివృత్తులతో ఉపనిషదంతఃపురమున గ్రీడించుచుండును.

**వి :** వారవనితలు - వీడు - వాడు అన్న భేదములేనివారై, సొమ్మిచ్చిన జాలును, ఎవనితోనైన గూడి విహరింతురు. వారియందు భేదభావము వాసనకైనను ఉండదు. భేదమెన్నుట వారి వృత్తికి భంగకరము.

శరీరేంద్రియనిష్ఠుడై తమ భోగమును సాగించుకొనుటకు సమర్థుడైన ప్రభువు ఇట్టి సొగసుకత్తెలైన వెలయాండ్రను ఎన్నికజేసి తెచ్చి - అంతఃపురములో వారితో గూడి విహరించును.

బ్రహ్మాన్వేషణపరములైన బుద్ధివృత్తులయందు భేదభావమునకు, విషయవాసనలకు ఆవంతైనను అవకాశము లేదు. అవి యున్నచో బ్రహ్మానుసంధాన మెట్లు సాగును?

వారవనితలు తమ సొగసుచే ఒయ్యారముచే తమ్ముగూడిన ప్రభువరు చిత్తము నలరించినట్లు - భేదవాసనారహితములైన బుద్ధివృత్తులు యోగీంద్రునకు బ్రహ్మానంద పారవశ్యమును గల్గించును.

అంతఃపురమన్నది లోపల ఎచటనో ఉండును. అచటి కందరును జేరలేరు.

బ్రహ్మజ్ఞానము నుపదేశించు ఉపనిషత్తులు వేదశీర్షములు. వాని భావము నందు కొనగల్గుట కష్టము.

ప్రభువునకు అంతఃపురము విహారభూమి! యోగివర్యునకు ఉపనిషదర్థము విహారభూమి! ఒకటి విషయానందము! వేరొకటి బ్రహ్మానందము!

**శ్లో॥ వైరాగ్యవిపులమార్గం**
**విజ్ఞానోద్దామదీపికోద్దీప్తమ్ ।**
**ఆరుహ్య తత్త్వహర్మ్యం**
**ముక్త్యా సహ మోదతే యతిరాట్ ॥ 48**

ప్ర : యతి–రాట్ = మునులకు రాజు అయిన యతీశ్వరుడు.
వైరాగ్యవిపులమార్గమ్ = వైరాగ్యము అనెడి వెడల్పు కల మార్గము కలదియును,
విజ్ఞానోద్దామ–దీపికోద్దీపమ్...
విజ్ఞాన = విజ్ఞానము అనెడి,
ఉద్దామ = పెద్దది యగు,
దీపిక = దీపము లతో,
ఉద్దీపమ్ = కాన్తివన్తమైనదియు, అగు,
తత్త్వహర్మ్యమ్ = ఆత్మజ్ఞానము అనెడి భవనమును,
ఆరుహ్య = ఎక్కి,
ముక్త్యా సహ = ముక్తి అను కాంతతో,
మోదతే = క్రీడించు చున్నాడు.

**తా॥** వైరాగ్య మను విశాలమైన మెట్లవరుస గుండా – విజ్ఞానమనెడి పెనుదివ్వెచే ప్రకాశవంతమై యున్న – నిత్యసత్యవస్తువైన పరబ్రహ్మ మనెడి మేడపై కెక్కి – యతిరాజు ముక్తికాంతతో గూడి ఆనందించుచుండును.

**వి :** మెట్లు లేనిదే మేడపైకి ఎక్కుట సంభవము కాదు. అది చక్కని మెట్ల వరుస అయినచో సుఖముగా అధిరోహింప వచ్చును.

పరబ్రహ్మమన్న సమున్నతప్రాసాదము నధిరోహించుటకు వైరాగ్యమే చక్కటి మెట్లదారి.

ఎటులో మేడమీదకు చేరుకొన్నను అది దీపములేని చీకటికోణమైనచో – అచటి ఒకటి వేరొకటిగా దోచును. అట్లే తగిన విజ్ఞానము లేకయే – తీవ్రధ్యానవిధానాదుల నవలంబించి

– ఎవడైనను దేహేంద్రియవైలక్షణ్యమును అనుభవించినను – వాడా అనుభవమును సరిగా గుర్తింపజాలడు. అట్టివాడు తన భ్రాంతిమయోపదేశములచే లోకమును తప్పుదారిని బట్టించును.

శ్రీ శంకరభగవత్పాదులకు బూర్వము తరువాత కూడ తగినంత విజ్ఞానములేకయే తమదైన సాధనచే దేహేంద్రియవిలక్షణనమైన భవ్యస్థితిని అనుభవించిన వార లున్నారు.

కాని వారు తగిన విజ్ఞానము లేనివారైనందున, ఆ స్థితి నందుకొనియు – సత్యమును అనుభవింపజాలనివారై లోకమునకు అద్వైతభిన్నములైన పలుమార్గములు ఉపదేశించుచు వచ్చిరి.

తగిన విజ్ఞానములేని బ్రహ్మానుభవము దీపములేని మేడ. (మహారత్నము లభించినను – దాని వెల తెలియనినాడు వాని దారిద్ర్యము తొలగదు) అందుచే గురూపదేశముచే పరోక్షజ్ఞానమును సంపాదించుకొని – ఎడతెగని వైరాగ్యాభ్యాసములచే – బ్రహ్మైక్యమును అనుభవింప వలయును.

ఎవడో యోగిపుంగవుడు మాత్రమే ఇట్టి బ్రహ్మానుభవమును గడించి – ముక్తి కాంతా సాహచర్యముచే జెన్నొంద నేర్చును.

**శ్లో॥ విజనతలోత్పలమాలాం**
**వనితావైతృష్ణ్యకల్పవల్లీం చ ।**
**అవమానామృతఘుటికా–**
**మాత్మజ్ఞః కోఽపి గృహ్ణాతి ॥ 49**

ప్ర : కోఽపి = ఒకానొక,
ఆత్మజ్ఞః = ఆత్మజ్ఞాని,
విజనతలోత్పలమాలామ్...
విజనతల = నిర్జనప్రదేశము అను,
ఉత్పలమాలామ్ = కలువపూలదండను,
గృహ్ణాతి = ధరించును,
వనితా–వైతృష్ణ్య–కల్పవల్లీమ్...
వనితా = స్త్రీలయందు,
వైతృష్ణ్య = విరక్తి అనెడి,
కల్పవల్లీమ్ = కల్పవృక్షపు తీగలను,

గృహ్ణాతి = ఆశ్రయించును,
అవమానామృత-ఘుటికామ్ చ...
అవమాన = అవమానము అనెడి,
అమృత = అమృతమునకు సంబంధించిన,
ఘుటికాం చ = ముద్దను కూడా,
గృహ్ణాతి = స్వీకరించును.

**తా॥** ఏకాంతవాసమును జక్కని పూలదండగా - వనితల తోడి విహారము నెడ పరాఙ్ముఖతను కల్పవృక్షపుదీవగా - అవమానమును అమృతఘుటికగా - ఆత్మజ్ఞాన సంపన్నుడు మాత్రమే స్వీకరింప గలడు.

**వి :** సాధారణలోకము శబ్ద, స్పర్శ, రూప, రస గంధాత్మక విషయములయందు రమించును. ఏకాంతప్రదేశమునందు ఇవి లభింపవు.

అందుచే విషయాభిముఖప్రవృత్తి గల లోకమునకు ఏకాంతవాసము కంటకకిరీటము వలె మహాదుఃఖమును గలిగించును.

విషయవిరహితుడైన యోగి దానిని (ఏకాంతవాసమును) కలువపూల దండనువలె ఆనందముతో స్వీకరించును.

శరీరమును వీడిన తరువాత గూడ - స్వర్గాది పుణ్యలోకములయందు అప్సరఃకాంతా-సమాగమమును వాంఛించిన వారై యజ్ఞయాగాది కర్మములయందు ప్రవర్తిల్లెడి జనులు కాంతయెడ పరాఙ్ముఖులై వర్తిల్లుటయా? అట్టి స్థితి విషపు దీవ వలె వారికి మహాదుఃఖమును దెచ్చి పెట్టును.

కాని యోగిపుంగవుడు లోకవిరుద్ధముగా కాంతావిహారసౌఖ్యమునందు - తనలో ఉదయించిన రోతను (జుగుప్సను, అసహ్యతను) కల్పలతికనువోలె స్వీకరించును, ఆదరించును, సంరక్షించును.

లోకమునకు అవమానము విషము. సమ్మానమమృతము, యోగి అవమానమును అమృతముగా స్వీకరించును.

అతని ఏకాంతదేశబ్రహ్మాత్మైక్యమునకు - లోక మొనరించు అవమానము మహోపకార మొనరించును గదా!

మహాయోగి మాత్రమే ఇటులుండగలడు.



**శ్లో॥ న నిషేధతి దోషధియా**
**గుణబుద్ధ్యా వా న కిఞ్చిదాదత్తే ।**
**ఆవిద్యకమఖిలమితి**
**జ్ఞాత్వోదాస్తే మునిః కోఽపి ॥ 50**

ప్ర : కోఽపి = ఒకానొక,
మునిః = ముని,
దోషధియా = దుష్టమైనది అను బుద్ధితో,
కిఞ్చిత్ = ఏ వస్తువును,
న నిషేధతి = తిరస్కరించదు,
గుణబుద్ధ్యా = సద్గుణములు కలది అను బుద్ధితో,
కిఞ్చిత్ = ఏ వస్తువును,
న ఆదత్తే = స్వీకరించదు,
అఖిలమ్ = సమస్త ప్రపంచమును,
ఆవిద్యకమ్ = అజ్ఞానము చేత పుట్టినది,
ఇతి = అని, జ్ఞాత్వా = తెలిసికొని,
ఉదాస్తే = ఉదాసీనముగా ఉండును (పట్టించుకొనడు).

**తా॥** యోగి యీ లోకమునందు ఎద్దానినైనను దోషమని భావించి పరిహరింపడు, గుణముగా దలంచి స్వీకరింపడు. అతనికి గుణదోషములు సమానములే! అన్నియును అవిద్యా విలాసములే! అతడన్నిటియెడ ఉదాసీనుడై యుండును.

వి : '**జడ – చేతన – గుణ – దోషమయ – విశ్వకీన్హకర్తార**' – తులసీదాసు

("జడ – చేతనములను, గుణ – దోషములను కలియబోసి పరమాత్మ యీలోకమును సృజించెను".)

దోషమేకాదు గుణముకూడ మాయావిలాసమే! పాపమే కాదు. పుణ్యము కూడ ఆత్మోపలబ్ధికి ఆటంకమే. దుష్కృతము దుఃఖానుభవమునకై శరీరబంధమును దెచ్చిపెట్టు చున్నది. సుకృతము సుఖానుభవమునకై శరీరమును గల్పించుచున్నది. రెండును బ్రహ్మానందానుభవమునుండి దిగజార్చునవియే.

అందుచే యోగిపుంగవుడు దోషమని యెంచి దేనినీ ద్వేషింపడు. గుణమని ఎంచి దేనినీ ఆదరింపడు. అతడు సర్వమైన అనాత్మవస్తువులయందును – అది గుణమైనను – దోషమైనను ఉదాసీనతనే – ఉపేక్షాభావమునే వహించును.



**శ్లో॥ భూతం కిమపి న మనుతే**
**భావి చ కిఞ్చిన్న చిన్తయత్యన్తః ।**
**పశ్యతి న పురోవర్త్యపి వస్తు**
**సమస్తార్థసమరసః కోఽపి ॥ 51**

ప్ర : సమస్తార్థ–సమరసః...
సమస్త = సమస్తములైన,
అర్థ = వస్తువులయందు,
సమరసః = సమభావన కల,
కోఽపి = ఒకానొక యోగి,
భూతమ్ = గతకాలమునకు సంబంధించిన,
కిమపి వస్తు = ఏ వస్తువును,
అన్తః = తన మనస్సు లోపల,
న మనుతే = తలచదు,
భావి = భవిష్యత్తులో జరుగబోవు,
కిఞ్చిత్ = ఏ సంఘటన గురించి,
న చిన్తయతి = ఆలోచించదు.
పురోవర్తి = వర్తమాన కాలంలో ఉన్న,
కిఞ్చిత్ వస్తు అపి = ఏ వస్తువును కూడా,
న పశ్యతి = చూడదు.

**తా॥** జీవన్ముక్తుడైన మహాత్ముడు - భూతార్థములను భావింపడు, భవిష్యదర్థములను జింతింపడు. సమస్తార్థముల యందును సమరస బుద్ధి గలవాడై (బ్రహ్మముగా దర్శించువాడై) తన ఎదుటనున్న దానిని సైతము తిలకింపడు.

**వి :** భూతము అనగా గడచినది. భావి లేక భవిష్యత్తు అనగా రానున్నది. రెండింటికిని నడుమ నున్నది వర్తమానము.

లోకము అధికసమయము భూతార్థభావనమందో – భవిష్యదర్థ చింతనమునందో తన్ను దా మరచి వర్తిల్లును. కేవల వర్తమానమునందది నిలువదు.

లోకముయొక్క యీ స్థితి స్వప్నమువంటిది. కల వంటిది. మన మెచట శయనించినామో ఆ ప్రదేశము – ఆ పరిసరములు కలయందు విస్మరింపబడును. ఏవో ప్రదేశములు – ఎవరో వ్యక్తులు కానవత్తురు.

అటులే తమ చిన్నదనములో – యౌవనారంభమున ఎపుడో జరిగిన ఏదో విషయమును భావించుచు లోకము వర్తమానార్థమును తత్కాలమున విస్మరించుచుండును. అట్లే ఇది యిట్లు చేయవలయును, ఇది యిట్లు జరుగవలెనన్న భవిష్యద్విషయోహలతో వర్తమానమును విస్మరించుచుండును.

కలయందు వర్తమానార్థము విస్మృతమై ఏదో ఏదో కానవచ్చినటులే ఇందును జరుగు–చున్నది కదా! అందుచే లోకముయొక్క యీ స్థితి (గతార్థభావనము భవిష్యదర్థచింతనము) స్వప్నసదృశము.

ఇక వర్తమాన మున్నది. అది నిరంతరము. భవిష్యదర్థము నుండి జనించుచు భూతముగా (గడచినదిగా) మారిపోవుచున్నది. వర్తమానము ఇట్లు భూతభవిష్యత్తులతో పెనవేసికొని యున్నదగుటచే ఇదియును తత్తుల్యమేకాని వేరైనది కాదు. (ఇంతకును ఇవన్నియు మనోవిలాసములే).

ఆత్మవస్తువునందు నిత్యజాగరూకుడైన యోగియం దీ స్వప్న ముండదు. భూత –భవిష్యద్వర్తమానార్థ చింతన ముండదు. అతడు జరిగిన దానిని జరుగబోయెడు దానిని మాత్రమే కాదు. వర్తమానమున దన ఎదుట నున్నదానిని సైతము భావింపడు. తిలకింపడు.

సర్వం బ్రహ్మమయమన్న భావనగలవాడై – నిత్యసమరసబుద్ధియై – (కాలాతీతుడై) విరాజిల్లును.

ఇట్టి యోగిపుంగవుడు వెదుకగా వెదుకగా ఎచటనైన లభించునేమో!

---

**శ్లో॥ నిగృహీతాఖిలకరణో**
**నిర్మృష్టాశేషవిషయేహః ।**
**తృప్తిమనుత్తమసీమాం**
**ప్రాప్తః పర్యటతి కోఽపి యతివర్యః ॥ 52**

ప్ర : నిగృహీతాఖిల–కరణః…
నిగృహీత = నిగ్రహించబడిన,
అఖిల = సమస్తములైన,
కరణః = ఇన్ద్రియములు కలవాడును,
నిర్మృష్టాశేష–విషయేహః…
నిర్మృష్ట = పూర్తిగా తొలగించబడిన,
అశేష = సమస్తములైన,

విషయేహః = విషయవాంఛలు కలవాడును అగు;
కోஉపి = ఒకానొక,
యతివర్యః = యతిశ్రేష్ఠుడు,
అనుత్తమసీమామ్...
అనుత్తమ = అత్యుత్తమమైన,
సీమామ్ = హద్దులు కల,
తృప్తిమ్ = ఆనందమును,
ప్రాప్తః = పొందిన వాడై,
పర్యటతి = లోకమంతట తిరుగాడుచున్నాడు.

**తా॥** ఇంద్రియముల నన్నిటిని బిగియబట్టి – నిలువరించి విషయవాసనల నన్నిటిని తొలగబెట్టి – తుడిచిపెట్టి, సర్వాధికమైన – బ్రహ్మానందసీమయందు ఎవడో యతిశేఖరుడు మాత్రమే విహరింపగలడు.

**వి :** '**ఇంద్రస్య – ఆత్మనః – నిఙ్గం – జ్ఞాపకం – ఇన్ద్రియమ్**' ఆత్మస్తువును సూచించునది యగుటచే ఇంద్రియము. శ్రోత్రాదులైన ఇంద్రియములు పని చేయుచున్నవి. ఎట్లు పని చేయుచున్నవి?

ఆత్మసామీప్యముచే బుద్ధియందు ప్రతిఫలించిన చైతన్యమును మనస్సు ద్వారా అందుకొని అవి పని సేయుచున్నవి.

గిన్నెలోని నీళ్ళు మరుగుచు – క్రింద అగ్ని జ్వలించుచున్నదని తెలియజేయుచున్నట్లు – ఇంద్రియములు తాము పనిసేయుచు – తమ వెనుకనున్న ఆత్మను జ్ఞప్తికి దెచ్చుచున్నవి. అందుచే వీనికి ఇంద్రియములని పేరేర్పడెను. విషయజ్ఞానమునకు సాధనము లగుటచే ఇవి 'కరణములు' అనబడెను. కరణము అనగా సాధనము.

"**యథా ప్రదీపేన కరణేన రూపముపలభ్యతే – తథా చక్షుషాஉపి కరణేన రూపముపలభ్యతే । ఏవమేవేతరాణ్యపి కరణాని**" – శ్రీశంకరభగవత్పాదులవారు.

చీకటిలోనున్న వస్తువుయొక్క రూపమును గ్రహించుటకు దీపము సాధనముగ ఉపయోగించు చున్నట్లు – రూపగ్రహణమున కన్ను సాధనముగా ఉపయోగించుచున్నది. ఇంద్రియము లన్నియును ఇటులే సాధనములుగా ఉపయోగపడుచున్నవి.

శబ్దగ్రహణమున చెవి – స్పర్శగ్రహణమున త్వగింద్రియము – రూపగ్రహణమున నేత్రము – రసవిషయమున జిహ్వ – గంధవిషయమున నాసిక – సాధనములై కరణము లనబడుచున్నవి.

నేరుపు గలవాడు సాధనమును జక్కగ వినియోగించి శ్రేయమొందును. నేరుపు లేనివాడు వానిని ఉపయోగించుకొనుట చేతకాక ప్రమాదమున జిక్కుకొనును.

గుఱ్ఱమున్నది, సైకిలున్నది. అవి ప్రయాణమున సాధనములే. వానిని నడుపుట ఒక నేర్పు. ఆ నేర్పు లేనివాడు ప్రమాదమున బడిపోవుచున్నాడు. ఇది మన ఎరుకలోనిదే!

అట్లే, ఇంద్రియములును పామరుని బ్రమాదమున బడదోయుచున్నవి. ప్రాజ్ఞుడు వానినే బిగియబట్టి, నిగ్రహించి శ్రేయమందుచున్నాడు.

ఒక గుఱ్ఱమునో – ఇతర వాహనమునో ప్రమాదము లేకుండ నడపుటకు నిగ్రహించుటకు నేర్పు కావలయును. ఇంద్రియములను నిగ్రహించుటకు దానికంటెను నేర్పు అవసరము. '**మనఃషష్ఠానీన్ద్రియాణి**' శ్రోత్రాది పంచకము – మానసము ఈ ఆరును జ్ఞానేంద్రియములు. వాగాది పంచకము కర్మేంద్రియములు. ఈ ఇంద్రియములు శబ్దాదివిషయములను మనసునకు అందించుచున్నవి. మనసుపై ఈ విషయములు విహరింపగా – అచట వాని వాసనలు పేరుకొనుచున్నవి. అట్లు పేరుకొన్న వాసనలచే బ్రేరితమై మనస్సు విషయాభిలాషతో ఇంద్రియములను గదలించుచున్నది.

కొడుకు తెచ్చిన మద్యమును ద్రావి మత్తిల్లినవాడు తద్వాసనచే బ్రేరితుడై – మరల మరల కొడుకును ఆ మద్యమును దెచ్చి అందించుమని ప్రేరణ చేసినట్లు –

విషయసుఖమత్తమై – తద్వాసనచే గదలిన మనస్సు ఇంద్రియములను పౌనఃపున్యముగా విషయముల వంక బరువెత్తించుచున్నది. మనసుయొక్క ఈ ప్రవృత్తికి తద్గతవిషయవాసనయే కారణము.

యోగి తన అంతఃకరణమునుండి విషయవాసనలను నిరంతరము బ్రహ్మభావనచే దుడిచిపెట్టివేయును. వాసనలే లేవు. అభిలాష ఎట్లు జనించును?

శ్రీమద్రామాయణమున ఋష్యశృంగుని కథ యున్నది. వయసులోనున్న సొగసుకత్తెలైన వారవనితలు రాచుకొని తిరిగినను ఆయన అంతరంగమున విషయాభిలాష జనింప లేదు – ఏల ఉదయింపలేదు. ఆ మహాత్ముని అంతరంగమున విషయవాసనలే లేవు.

మహాయోగుల అంతరంగము – విషయవాసనారహితమై శుద్ధమై యుండును. ఇట్టి మహనీయులు నిస్సీమానందదేశమున నిరంతరము విహరించుచుందురు.

**శ్లో॥ సన్త్యజతి నోపపన్నం**
**నాసమ్పన్నం చ వాఞ్ఛతి క్వాపి ।**

**స్వస్థః శేతే యతిరా-**
**డాన్తరమానన్దమనుభవన్నేకః ॥ 53**

**ప్ర :** ఏకః = ఒకానొక,
యతి రాట్ = యతీశ్వరుడు,
ఉపపన్నమ్ = దైవికముగ లభించిన దానిని,
న సన్త్యజతి = విడిచిపెట్టడు.
అసమ్పన్నమ్ = లభించని దానిని,
క్వాపి = ఎక్కడను కూడా,
న వాఞ్ఛతి = కోరుకొనడు.
ఆన్తరమ్ = తనలోపల నున్న,
ఆనన్దమ్ = ఆనందమును,
అనుభవన్ = అనుభవించుచూ,
స్వస్థః = సుఖముగా,
శేతే = నిద్రించుచున్నాడు.

**తా॥** యోగి తనకు ఉపలబ్ధమైన దానిని కాదనడు. అనులబ్ధమును వాంఛింపడు. అంతరానందానుభవమగ్నుడై స్వస్థుడై యుండును.

**వి :** "శరీరమునకు నిత్యము ప్రాతవస్తువు కావలెను. మనసుకు నిత్యము నూతన వస్తువు కావలెను." ఇది వాని స్వభావము.

ఏ మంచము – ఏ దిండు – ఏ గది – ఏ వాహనము ఉపయోగించుట జరుగుచున్నదో శరీరమునకు అదే మంచము – అదే దిండు – అదే గది – అదే వాహనము కావలెను. మారినచో సుఖముండదు. ఇట్లు శరీరము అన్నిటిని వెనుకటి వానినే కోరుకొనును.

మనసు అట్లు కాదు. దానికి నిత్యము క్రొత్తది కావలయును. ఏ కథవిని ఇంతవరకును ఆనందించుట జరిగెనో అదే కథ వినుటకు మనసు సుముఖము కాదు. ఇష్టపడదు.

ఏ సుందరి పొందుకై ఇంతవరకు తపించెనో అది లభించిన పిమ్మట దానియెడ విరక్తయై క్రొత్తదానిని వాంఛించును.

ఏదియైనను తనకు లభింపనంతవరకు మాత్రమే మనసు దానికై ఆరాటపడును. లభించినమీదట దానియెడ విరక్తమై వేరొకటి క్రొత్తది కావలెననును. అందుచే ఆరాటమే కాని ఆనంద మన్నది మనసుద్వారా లభించుట కల్ల.

'అదేదో అది' లభించిన చాలును. నాకు వేరేమియు అక్కరలేదు. అని మనసు ప్రతిజ్ఞలు పలుకును. 'అదేదో అది' లభించినది. వెంటనే మనసు తన ప్రతిజ్ఞను గాలికి వదలి వేయును. లభించిన దానియెడ అసంతృప్తమై – వేరొకదానికై కుతూహలమును వ్యక్తపరచును.

యోగియొక్క మానసము సామాన్యలోకముయొక్క మానసమునకు భిన్నముగా నుండును.

**"లభించినదానియెడ నిరసనభావము, లభింపని దానియెడ వాంఛాలక్షణము"**

యోగి మానసమునందుండవు. అతని మానసము అపారమైన అంతరానందమున – దేనికి సాటియన్నది లేదో – అట్టి బ్రహ్మానందమున నిత్యతృప్తమై – అన్యవాంఛారహితమై యుండుటయే దీనికి హేతువు.

ఈ లోకమునం దెవరును సుఖముగా శయనించుట లేదు. రేపు – 'ఇది చేయవలయును. అది సంపాదింపవలెను. ఈ అడ్డమును తొలగించుకొనవలయును' – ఇత్యాదిగా బహువిధములైన ఆవేదనలతోడనే లోకము శయ్యపై మేను వాల్చుచున్నది.

యోగిపుంగవుడు మాత్రమే స్వస్థభావముతో శయనించును.

---

**శ్లో॥ కామపి విమలాం పదవీ-**
**మాసాద్యానన్దసంవిదున్నిద్రామ్ ।**
**ఆస్తే భిక్షుక ఏకో**
**విహరన్నిర్ముక్తబన్ధనః స్వైరమ్ ॥ 54**

ప్ర : ఆనన్ద–సంవిదున్నిద్రామ్...
ఆనన్ద = ఆనన్ద స్వరూపమైన,
సంవిత్ = జ్ఞానముతో,
ఉన్నిద్రామ్ = నిద్రనుండి మేల్కొన్న,
విమలామ్ = నిర్మలమైన,
కామపి = అనిర్వచనీయమైన,
పదవీమ్ = స్థానమును,
ఆసాద్య = పొంది,
నిర్ముక్త–బన్ధనః...
నిర్ముక్త = సంపూర్ణముగా తొలగించబడిన,
బన్ధనః = బంధనములు కలవాడై,

ఏకః = ఒకానొక,
భిక్షుకః = సంన్యాసి,
స్వైరమ్ = స్వేచ్ఛగా,
విహరన్ = సంచరించుచూ,
ఆస్తే = ఉన్నాడు.

**తా॥** జ్ఞానానందములు నిత్యజాగృతములై – వికసితములై వర్తిల్లు – విమలమైన – అనిర్వచనీయ స్థానమును జేరుకొన్నవాడై బంధరహితుడై, సర్వవిధముల స్వతంత్రుడై భిక్షకుడొకడు విహరించు చున్నాడు.

**వి :** 'దేశములో రాష్ట్రపతి పదవి పెద్దపదవి. ఆయన సర్వవిధముల స్వతంత్రుడు. ఆ పదవి ఎవనికో భాగ్యవంతునకు లభించును' – అని చెప్పుటలో అర్థమున్నది.

కాని ఎవడో భిక్షకుడు, తిన తిండి – కట్ట బట్ట తలదాచుకొనుటకు ఒక చిన్న పూరిగుడిశ అయినను లేనివాడు అపారానందమును అనుభవించుచున్న స్వతంత్రుడని చెప్పుచున్నారా? ఇదేమి విడ్డూరము? అనిపించును.

రాష్ట్రపతి పదవియైనను భయరహితము కాదు. భయరహితమైనచో అంగరక్షకు లెందుకు? అది శాశ్వతమును కాదు. భయస్థానమున లభించు ఆనంద మేమి ఆనందము?

భిక్షకుడు – కట్టబట్ట లేనివాడు – తిన దిండి లేనివాడు – అని మనము భావించు యోగిపుంగవుడో! ఆయన గతమును భావింపడు. భవిష్యత్తును జింతింపడు! బ్రహ్మానంద–సామ్రాజ్యపట్టాభిషిక్తుడైన ఆతనికి బ్రహ్మాదులును సాటికారు. అందుచే అతడొకడు మాత్రమే ఉన్నతపదవియందుండి అపారానందమును అనుభవించుచున్నాడు.



**శ్లో॥ వస్తున్యస్తమితాఖిల–**
**విశ్వవిహారే విలీనమనాః ।**
**రాజతి పరానపేక్షో**
**రాజాఽఖిలవీతరాగాణామ్ ॥ 55**

ప్ర : అస్తమితాఖిల–విశ్వ–విహారే...
అస్తమిత = నశించిన,
అఖిల = సమస్తములైన,
విశ్వ = పదార్థముల యొక్క,
విహారే = విహారము కల,

వస్తుని = ఆత్మ పదార్థము నందు,
విలీనమనాః = బాగుగా లీనమైన మనస్సు కలవాడును,
వీతరాగాణామ్ = వైరాగ్యము కలవారలకు,
రాజా = రాజును, అగు ఒకానొక యోగి;
పరానపేక్షః = ఇతరుల సహాయం కోరనివాడై,
రాజతి = ప్రకాశించుచున్నాడు.

**తా॥** సర్వవిశ్వవిహారము ఎందు అస్తమించి కానరాకుండ బోవుచున్నదో – అట్టి వస్తువునందు (పరబ్రహ్మమునందు) విలీనమైన మానసము గలవాడై – వైరాగ్యభాగ్యసంపన్నులలో జక్రవర్తియై యతిశేఖరుడొకడు ఇతరాపేక్ష లేనివాడై విరాజిల్లుచున్నాడు.

**వి :** కలలో విహరించుట ఎంతవరకు? మెలకువ రానంత వరకు. మెలకువ వచ్చినంతనే స్వప్న విహారమెల్ల అస్తమించుచున్నది. కలలోని ఆ వస్తువులు – వ్యక్తులు – వానియం దేర్పడిన రాగద్వేషాదులు – ఈర్ష్యా భయకంపాదులు ఇవన్నియును అదృశ్యము లగుచున్నవి. జాగృతియందు, మెలకువయందు అస్తమించుచున్నవి.

అట్లే అజ్ఞానమన్న పెను నిద్దురయం దేర్పడిన యీ విశ్వ స్వప్న మెల్ల – ఆత్మజ్ఞానరూపమైన జాగృతి ఉదయించినంతనే అస్తమించి పోవుచున్నది. అనగా ఆత్మవిద్య ఉపలబ్ధమైనంతనే విశ్వస్వప్నవిహారము పరసమాప్త మగుచున్నది. సర్వమైన విశ్వము ఆత్మోపలబ్ధియం దంతర్హితమై పోవుచున్నది.

వైరాగ్యమనగా విరక్తి; ఇహాముత్రఫలభోగమునందు అనాసక్తి. అది లేకున్న బ్రహ్మానుభవము సున్న. ఆ వైరాగ్యమైనను అసాధారణమై యుండవలయును. అపుడే విశ్వస్వప్నము తిరోహిత మగును. లేకున్న సగము నిద్దుర – సగము మెలకువ అయిన దశయందువలె విశ్వస్వప్నము ఖండఖండములుగా అనువర్తించుచుండునే గాని పూర్తిగా దొలగదు.

ఎవడో అసాధారణవైరాగ్యసంపన్నుడైన యతిలోకచక్రవర్తి మాత్రమే ఈ స్థితి నందుకొని విరాజిల్లును.

**శ్లో॥ ఆచార్యాపాఙ్గదృశా**
**సమవాప్తాపారసంవిదాకారః ।**
**ప్రశమితసకలవిభేదః**
**పరహంసః కశ్చిదాభాతి ॥ 56**

ప్ర : ఆచార్యాపాఙ్గదృశా...
ఆచార్య = గురుదేవుల యొక్క,
అపాఙ్గదృశా = కటాక్ష వీక్షణముతో,
సమవాప్తాపార-సంవిదాకారః...
సమావాప్త = పొందబడిన,
అపార = హద్దులు లేని,
సంవిత్ = జ్ఞానము యొక్క,
ఆకారః = ఆకారము కలవాడును,
ప్రశమిత-సకల-విభేదః...
ప్రశమిత = బాగుగా శమించిన,
సకల = సకలములైన,
విభేదః = భేదములు కలవాడును, అగు;
పరమహంసః = పరమహంస అను పేరు గల ఉత్తమ సన్యాసి,
కశ్చిద్ = ఒకానొకడు,
ఆభాతి = భాసించుచున్నాడు.

**తా॥** శ్రీగురుకరుణాకటాక్షముచే - అంతములేని జ్ఞానముయొక్క ఆకారమును అందుకొన్నవాడై - పరమహంస యొకడు అస్తమితాఖిలభేదభావనుడై విరాజిల్లుచున్నాడు.

**వి :** గురువులేని విద్య కుంటివిద్య. ఏ విద్యనైనను గురువులేకయే అందుకొనగలరేమో కాని, శ్రీగురుని కరుణలేక ఆత్మవిద్య అలవడదు.

ప్రఫుల్లమైన అంతరంగముతో గురువొనరించు '**తత్త్వమసి**' ఇత్యాది మహావాక్యా-ర్థోపదేశమే శ్రీగురుని కరుణ. దానిచే మాత్రమే అజ్ఞానవిలాసమైన సంసారము నివర్తించును. ఎవడైనను మహావాక్యార్థమననము చేతనే - 'శరీరము తాను కాననియు, అపారమైన సంవిత్తు, అనగా జ్ఞానము, అదే తన రూపమనియు గ్రహింప నేర్చును'.

అపుడు వానికి సర్వమును ఆత్మస్వరూపముగ అనుభవమునకు వచ్చును. ఆత్మకంటె - బ్రహ్మముకంటె వేరైన దెద్దియును గోచరింపదు. అందుచే అతనియందు లేశమును భేదభావము మిగిలియుండదు.

ఇట్టి స్థితి నందుగొనిన పరమహంసయైన యోగీంద్రుడొక్కడు మాత్రమే చిదానందాకృతి యై విరాజిల్లును. '**హన్తీతి - హంసః**' - హన హింసాగత్యోః. 'నడచువాడు, పోవువాడు' అని హంస శబ్దమునకు అర్థము.

ఎవడీ సంసారచక్రమునుండి పరమాత్మవంకకు బోవుటకై చక్కని మార్గము నేర్పరచుకొని, అందు సాగుచున్నాడో - పోవుచున్నాడో వాడు హంస. అనగా యోగి, యతి, వారిలో శ్రేష్ఠుడు 'పరహంస. పరమహంస'.

పామరమైన లోకమెల్ల సంసారమునుండి కదలనిదే. ప్రాజ్ఞులయందు గూడ ఎవడో మహనీయుడు మాత్రమే 'హంస-పరమహంస' పదము నందుకొనును. అతనికి మాత్రమే భేదరహితమైన బ్రహ్మానుభవము సాధ్యము. అదియైనను శ్రీగురుకరుణావిశేషముచే మాత్రమే లభించును.

---

**శ్లో॥ వర్ణాశ్రమవ్యవస్థా-**
**ముత్తీర్య విధూయ విధ్యాదీన్ ।**
**పరిశిష్యతే యతీన్ద్రః**
**పరిపూర్ణానన్దబోధమాత్రేణ ॥** **57**

ప్ర : వర్ణాశ్రమ-వ్యవస్థామ్...
వర్ణ = బ్రాహ్మణాది వర్ణముల యొక్క,
ఆశ్రమ = బ్రహ్మచర్యాది ఆశ్రమముల యొక్క,
వ్యవస్థామ్ = వ్యవస్థను,
ఉత్తీర్య = అతిక్రమించి (దాటి),
విధ్యాదీన్ = విధి నిషేధములను,
విధూయ = తిరస్కరించి,
పరిపూర్ణానన్ద-బోధమాత్రేణ...
పరిపూర్ణ = సంపూర్ణమైన,
ఆనంద = ఆనన్దస్వరూపమైన,
బోధ మాత్రేణ = ఒకే ఒక్క జ్ఞానముగా,
యతీన్ద్రః = యతీశ్వరుడు,
పరిశిష్యతే = మిగులుచున్నాడు.

**తా॥** అఖండానందమయమైన బ్రహ్మమును గూర్చిన బోధము ఆవిర్భవింపగా - యతిశేఖరుడు వర్ణాశ్రమవ్యవస్థను మీఱి - బ్రహ్మాదులను క్రిందొనరించి, అద్వితీయ పరబ్రహ్మవస్తువై విభాసించుచున్నాడు.

**వి :** బ్రాహ్మణాది వర్ణవ్యవస్థను - ఆశ్రమవ్యవస్థను పాలింపవలసినవారు ఎవరు? శరీరేంద్రియనిష్ఠులు. ఈ వ్యవస్థను పాలించుట తప్పదు.

శరీరేంద్రియవిలక్షణమైన ఆత్మ స్వరూపమును గుర్తించి బ్రహ్మమే తానన్న బోధమున నిలిచినవానికి వర్ణము లేమిటి? ఆశ్రమము లేమిటి?

**'చండాలోఽస్తు స తు ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ'**

– మనీషాపంచకము.

వాడు బ్రాహ్మణుడైనను చండాలుడైనను సర్వలోకపూజ్యుడే. ఆ మహానుభావుడు ఇతరుల యెడను – బ్రాహ్మణాది వర్ణజనిత – ఆశ్రమజనిత భేదభావములను బ్రదర్శింపడు. సర్వమును బ్రహ్మమయముగా అనుభవించును.

బ్రహ్మవిద్వరేణ్యుడైన యోగీంద్రుడు తృణీకృతబ్రహ్మపురందరుడు, అనగా ఇంద్రపదవిని – బ్రహ్మపదవిని గడ్డిపరకగా జూచును.

బ్రహ్మయొక్క ఆయువు ఎంత ఎక్కువైనను దానికిని అంతమున్నది. '**అద్య బ్రాహ్మణః – ద్వితీయపరార్థే**' అని సంకల్పములో చెప్పుచున్నారు.

పర+అర్ధము = గొప్పదైన సగము. బ్రహ్మయొక్క ఆయువు చాల పెద్దది. దానిని రెండు సగములుగా జేసినపుడు అవి చాల పెద్దవైన రెండు సగములు – అర్ధభాగములు అగును. మొదటి సగము ప్రథమ పరార్ధము – రెండవ సగము ద్వితీయ పరార్ధము.

ఇపుడున్న బ్రహ్మకు ఏబదేండ్లు గడచిపోయినవి. ఆరవపడిలో బడినాడు. ఈ ద్వితీయ పరార్ధము పరిసమాప్తమైనచో ఈ బ్రహ్మ యుండడు. వేరొకడు బ్రహ్మపదము నధిష్ఠించును.

ఇట్లు బ్రహ్మాదుల పదవులు అశాశ్వతములై యుండగా యోగి శాశ్వతమైన – పునరావృత్తి రహితమైన (న స పునరావర్తతే) పరబ్రహ్మము తానై ప్రకాశించుచున్నాడు.

శాశ్వతుడు నశ్వరుని గ్రిందుసేయుటయం దాశ్చర్య మేమున్నది?

అఖండానందమయ పరబ్రహ్మము తానన్న అనుభవము నందుకొన్నవాడు విశ్వాతీతుడై – బ్రహ్మాధికుడై – అద్వితీయుడై అలరారుచున్నాడు.



**శ్రీసదాశివబ్రహ్మేంద్రులవారు** ఇంతవరకును ఆత్మవిద్యావిలాసమైన జీవన్ముక్తిని బ్రస్తుతించిన వారై – గ్రంథోపసంహారముగా ఇకమీదట విదేహముక్తిని వినుతించుచున్నారు.

**శ్లో॥ క్షయముపనీయ సమస్తం**
**కర్మ ప్రారబ్ధముపభుజ్య ।**
**ప్రవిగలతదేహబన్ధః**
**ప్రాజ్ఞో బ్రహ్మైవ కేవలం భవతి ॥ 58**

**ప్ర :** సమస్తమ్ = సమస్తమైన,
కర్మ = కర్మను,
క్షయమ్ = నాశనమును,
ఉపనీయ = పొందించి,
ప్రారబ్ధమ్ = ప్రారబ్ధకర్మను,
ఉపభుజ్య = అనుభవించి,
ప్రవిగళిత–దేహబన్ధః...
ప్రవిగళిత = బాగుగా విడిచిపెట్టబడిన,
దేహబన్ధః = దేహముతో బంధము కలవాడై,
ప్రాజ్ఞః = జ్ఞాని,
బ్రహ్మ ఏవ = బ్రహ్మయే,
భవతి = అగుచున్నాడు.

**తా॥** అసంగుడై – ఆత్మనిష్ఠుడై చరించుటచే సంచిత, ఆగామికర్మములను; అనుభవముచే ప్రారబ్ధకర్మమును క్షయింపజేసినవాడై యోగీంద్రుడు – దేహము రాలిపోగా కేవలపరబ్రహ్మమే తానగుచున్నాడు.

**వి :** తప ఆదికముచే సంచిత ఆగామి కర్మములు మాత్రమే నశించును. ప్రారబ్ధము (ఏ కర్మఫలానుభవమునకై శరీర మేర్పడినదో అది) అనుభవముచేతనే నశించును. (ప్రారబ్ధం భోగతో నశ్యేత్).

ఈ గ్రంథమునం దింతవరకు ఏ ఆత్మవిద్యావైభవము ప్రస్తుతింపబడెనో – దానిని స్వాయత్త మొనరించుకొని సదా ఆత్మనిష్ఠుడై – దేహేంద్రియములతోడి తాదాత్మ్యమును బూర్తిగ విడిచిపెట్టి అసంగుడై చరించుట ద్వారా –

విస్తరలోనున్న అన్నము, వండబడుచున్న అన్నమువలె సంచిత ఆగామి కర్మములు యోగీంద్రుని అనుభమునకు రాకయే నశించును.

విస్తరలో నున్నదైనను – వండబడుచున్న దైనను తినగోరువాని అనుభవమునకు వచ్చునే గాని – ఇచ్ఛారహితుడై ప్రవృత్తిలేని వానికి వాని అనుభవ మెట్లు సిద్ధించును?

ప్రారబ్ధము మాత్రము ఇదివరకే తిన్న అన్నమువలె తనపని తాను జేయక విరమింపదు. కాగా అసంగుడై చరించుటచే సంచిత ఆగామి కర్మములు నశించును. అనుభవముచే ప్రారబ్ధకర్మము నశించును.

ప్రాజ్ఞుడైన యోగీంద్రు డిట్లు సర్వకర్మములను విలయ మొనరించుటచే – దేహపాతానంతరము – తిరుగ దేహమును దాల్చుటకు దగిన కర్మమే శేషించి యుండదు.

అతడు శరీరముతో మన నడుమ నడయాడుచున్నపుడే బ్రహ్మమై యున్నాడు గదా! శరీరపాతానంతరము – వేరొక శరీరమును మొలకెత్తించు శరీర మెద్దియును శేషించి యుండని దశయందు కేవల పరబ్రహ్మమే యగుచున్నాడు.



ప్రాజ్ఞుడు దేహపాతానంతరము కేవల పరబ్రహ్మమే తానగుచున్నాడని జెప్పినారు కదా! ఆ పరబ్రహ్మ మెట్టిదో నాలుగు శ్లోకములలో వివరించు చున్నాడు.

**శ్లో॥ స్తిమితమనన్తమనాద్యం**
**సన్తతమానన్దబోధఘనమ్ ।**
**అవికల్పమాద్యమేకం**
**సన్మాత్రం విద్యతే కిమపి ॥ 59**

ప్ర : స్తిమితమ్ = నిశ్చలమైనదియు,
అనన్తమ్ = నాశనము లేనిదియు,
అనాఖ్యమ్ = పేరు లేనిదియు,
తతమ్ = అంతటా వ్యాపించినదియు,
అతుల = సాటిలేనిదియు,
ఆనన్దబోధఘనమ్ = ఘనీభవించిన జ్ఞానానన్దస్వరూపము అయినదియు,
అవికల్పమ్ = ఎట్టి వికల్పములు లేనిదియు,
ఆద్యమ్ = మొట్టమొదటిదియు, అగు;
కిమపి = అనిర్వచనీయమైన,
సన్మాత్రమ్ = 'సత్' పదార్థము,
ఏకమ్ = ఒక్కటి,
విద్యతే = కలదు.

**తా॥** కదలిక లేనిదై – మొదలు చివర లేనిదై (పేరులేనిదై) – జ్ఞానానందపరిపూర్ణమై – వికల్పరహితమై – సత్తామాత్రముగ విరాజిల్లు అనిర్వచనీయవస్తువొకటి (పరబ్రహ్మము) విభాసిల్లుచున్నది.

**వి :** యోగీంద్రుడు దేహపాతానంతరము కేవలపరబ్రహ్మ మగుచున్నాడని చెప్పుటచే – బ్రహ్మస్వరూప మెట్టిదై యుండునని పాఠకుని మానసము తడువుకొనునని – శ్రీసదాశివ–బ్రహ్మేం ద్రుల వారు నాలుగు శ్లోకములలో పరబ్రహ్మస్వరూపమును దిఙ్మాత్రముగ సూచించు చున్నారు.

పరబ్రహ్మము స్తిమితము – అనంతము – అనాది.

ఎచట రెండవ వస్తువులేదో అచట కదలిక యుండుటకు వీలు లేదు. అంతటను వెలితియున్నది. లేక – అద్వితీయమై పరబ్రహ్మము అలరారుచున్నది. దానియందు చలనముండదు. అది స్తిమితమైనది.

సృష్టికి బూర్వము – ప్రలయమునకు బిమ్మటగూడ నిర్వికారమై యుండునది యగుటచే పరబ్రహ్మము అనాది అనంతము.

పరిపూర్ణజ్ఞానానందములే దాని రూపము. అన్యమన్నదిలేక ఒంటిగా విరాజిల్లుచున్న దగుటచే అది వికల్పరహితము. రెండవది లేదు. అందుచే అది అద్వితీయము.

రెండవది లేదని అనుట ఎట్లు? జ్ఞానము ఆనందము రెండు కావా? అనిపించును. అవి రెండు కావు. ఒక్కటే. జ్ఞానానందములుగా నున్న దొక్కటియే. అదే జ్ఞానము. అదే ఆనందము.

పోనిమ్ము, బ్రహ్మభిన్నమై ప్రపంచమున్నదిగదా? బ్రహ్మము అద్వితీయమనుట ఎట్లు కుదురును అని జిజ్ఞాస ఉదయించును.

అభ్యాసదశయందున్న వారికై ఈ ప్రపంచము బ్రహ్మభిన్నమని చెప్పబడెను. ఈ ప్రపంచము కూడ బ్రహ్మమే – బ్రహ్మవ్యతిరిక్తము కాదు.

కార్యము కారణము కంటె వేరైనది కాదు, ఒక మట్టి కడవ యున్నది. కడవగా నున్నపుడును – పగిలి ముక్కలైనపుడును, కడవగా మారుటకు పూర్వమును – అది మన్నే – మట్టియందే నామరూపములు కల్పితము లయ్యెను. కల్పితము అసత్యము. అది మృత్తే. మృద్భిన్న మెన్నడును కాదు.

పరబ్రహ్మము నాశ్రయించి చెలగిన మాయయొక్క విలాసముగా ఉదయించిన – ఈ నామరూపాత్మకప్రపంచము గూడ – పరమకారణమైన పరబ్రహ్మముకంటె వేరైనది ఎట్లగును?

అందుచే అభ్యాసారంభమున – ప్రపంచము వేరు, బ్రహ్మము వేరు, అనాత్మవస్తువు – ఆత్మవస్తువు అని చెప్పుదురు.

అభ్యాసముయొక్క పూర్ణావస్థయందో అనగా సిద్ధావస్థ యందు – '**సర్వం ఖల్విదం బ్రహ్మ**' – '**నేహ నానాస్తి కించన**' – ఉన్నదొక్కటే, రెండవది లేదు, లేనే లేదు, అని అనుభవమునకు వచ్చును.

కుండలు ఎన్నిరకములుగా – ఎన్ని పేరులతో గోచరించుచున్నను ప్రాజ్ఞుడు అదెల్ల మృత్తే అని తలంచినట్లు – ఆత్మవిద్యాసంపన్నుడు గూడ సర్వమును అద్వితీయ పరబ్రహ్మమున అనుభవించును.

**'విచారేఽ ప్యయమేవార్థోఽ యమేవార్థోఽ విచారణే'** జ్ఞాని విచారించి 'ఉన్నదొక్కటే' యని గ్రహించుగాక! అజ్ఞాని తత్త్వమును గ్రహింపజాలక నానాత్వమును భావించుగాక!

ఉన్నదొక్కటే! దానియందు మార్పులేదు. అది సన్మాత్రము.

'సన్మాత్రము' – అను ఈ పదము అద్భుతమైనది. సత్త అనగా ఉనికి. 'ఉనికియే' బ్రహ్మస్వరూపము అని ఈ పదము తెలుపుచున్నది.

'దేహమున్నది; ప్రపంచమున్నది' అన్నపుడు వీనికి గారణమైన వస్తువొకటి యున్నదని ఊహకు అందుచున్నది. అదేదో ఆ పరమకారణవస్తువుయొక్క ఉనికియే అనుభవమునకు అందుచున్నది గాని – వస్త్వనుభవము సంభవము కాదు.

అందుచే పరబ్రహ్మము సన్మాత్రము. కేవల సత్తా స్వరూపము. ఉనికియే రూపముగా గలది. ఈ సత్త – ఈ ఉనికి జ్ఞానానందములకంటె వేరైనది కాదు. 'సచ్చిదానందములు' అను మూడు శబ్దములచే ఇది పేర్కొనబడుగాక! ఇందు స్వగతభేదము లేశమును లేదు. **ఈ సత్ – చిత్ – ఆనందములు ఒకదానికంటె ఒకటి వేరైనవి కావు.**

(గురూపదేశపూర్వకమైన నిరంతరాభ్యాసముచే మాత్రమే దీనిని దెలియగలరు).

శరీరమును వీడిన పిమ్మట యోగి యిట్టి పరబ్రహ్మము కేవలపరబ్రహ్మమే తానగుచున్నాడని తాత్పర్యము.

**శ్లో॥ అక్షరమజరమజాతం**
**సూక్ష్మతరాపూర్వశుద్ధవిజ్ఞానమ్ ।**
**ప్రగళితసర్వక్లేశం**
**పరతత్త్వం వర్తతే కిమపి ॥ 60**

ప్ర : అక్షరమ్ = నాశనము లేనిదియు,
అజరమ్ = ముసలితనము లేనిదియును,
అజాతమ్ = పుట్టుక లేనిదియు,
సూక్ష్మతరాపూర్వ–శుద్ధవిజ్ఞానమ్...
సూక్ష్మతర = మిక్కిలి సూక్ష్మమైనదియు,
అపూర్వ = నూతనమైనదియు, అగు,
శుద్ధ–విజ్ఞానమ్ = నిర్మలమైన విజ్ఞానము అయినదియు,
ప్రగళితసర్వక్లేశమ్...
ప్రగళిత = బాగుగా విడువబడిన,

సర్వ = సమస్తమైన,
క్లేశమ్ =దుఃఖములు కలదియును, అగు;
కిమపి = అనిర్వచనీయమైన,
పరతత్త్వమ్ = పరమాత్మ పదార్థము,
వర్తతే = కలదు.

**తా॥** ఆ పరబ్రహ్మము జన్మ – జరా – మరణములు లేనిది. మిక్కిలి సూక్ష్మమైనది, అందు క్లేశమన్నది లేశమును లేదు. సర్వతత్త్వములకును అవ్వలిదై – అద్వితీయమై ప్రకాశించు చున్నది.

**వి :** జన్మ – జరా – మరణములు దేహమునకు పరబ్రహ్మమో!

'**న జాయతే మ్రియతే వా కదాచిత్ ।**
**నాయం భూత్వా భవితా వా న భూయః॥** ' – గీత.

దానికి జన్మ – జరా – మరణములు లేవు.

ఘట శరావాది నామరూపము లెన్ని కల్పితములై అణగారినను, మృత్తు జననమరణము లందినట్లు కాదు.

మాయావిలాసముగా ఈ ప్రపంచ మెన్నో విధముల గల్పితమై పెరిగి విరిగి తరుగుగాక!

ఈ మాయ దేని నాశ్రయించి చెలగుచున్నదో, దేనియందణగారుచున్నదో, ఆ పరబ్రహ్మము నిర్వికారమే. అందుచే పరబ్రహ్మము అక్షరము, అజరము, అజాతము.

ఈ పరబ్రహ్మము ఒక వస్తువు కాదు, కేవలము సత్తగా (ఉనికిగా) సన్మాత్రముగా అనుభవింపదగినది. అందుచే దీనికంటె సూక్ష్మమైనది ఉండనేరదు.

సుఖము – దుఃఖము దేహేంద్రియాంతఃకరణముల వరకును సాగి రాగలవు. అటు తరువాత సాగలేవు.

సర్వతత్త్వములకును అవ్వలిదైన పరబ్రహ్మమునందు వానికి బ్రవేశము సంభవము కాదు. అందుచే అది క్లేశరహితమైనది.

జ్ఞానస్వరూపమైన ఆ పరబ్రహ్మము అనిర్వచనీయము – అద్వితీయము.

యోగి శరీరపాతానంతరము ఇట్టి కేవలపరబ్రహ్మము తానగుచున్నాడు. అనగా – బ్రహ్మ వస్తువునకు వాడబడిన సర్వవిశేషణములు అతనికి చెందినవియే అగుచున్నవి.



**శ్లో॥ సుఖతరమమరమదూరం**
**సారం సంసారవారిధేస్తీరమ్ ।**
**సమరసమభయమపారం**
**సత్కిఞ్చన విద్యతే తత్త్వమ్ ॥ 61**

ప్ర : సుఖతరమ్ = మరింత సుఖమైనదియును,
అమరమ్ = మరణము లేనిదియును,
అదూరమ్ = దూరముగా లేనిదియును,
సారమ్ = సారభూతమైనదియును,
సంసారవారిధేః = సంసారము అను సముద్రమునకు,
తీరమ్ = ఆవలి ఒడ్డు అయినటువంటిదియు,
సమరసమ్ = సమానమైన ఆనందము కలదియు,
అభయమ్ = భయము లేనిదియును,
అపారమ్ = అంతులేనిదియు,
సత్ = సత్ స్వరూపమైనదియు, అగు;
కిఞ్చన = ఒకానొక (అనిర్వచనీయమైన),
తత్త్వమ్ = పదార్థము,
దీవ్యతే = వెలుగొందుచున్నది.

**తా॥** ఆ పరబ్రహ్మము సుఖస్వరూపము . అవినాశి. నిత్యసన్నిహితము. సంసారసముద్రమును తీరభూమి. అది నిత్య సమరసము. అభయస్థానము. అంతములేనిది. అనిర్వచనీయము. అద్వితీయము.

యోగిపుంగవుడు దేహపాతానంతరము – ఇట్టి అద్వితీయ – అనిర్వచనీయ పరబ్రహ్మము తానై, పునరావృత్తిరహితుడై విరాజిల్లును.

**వి :** ఎంత దగ్గరలో నున్న వస్తువైనను సూక్ష్మముగా బరిశీలించినపుడు దానికిని మనకును నడుమ కొంత అంతరముండక తప్పదు.

కాని పరబ్రహ్మము అట్లు కాదు. అదే మనమై యున్నాము. అందుచే దానికంటె సన్నిహితమైన – నిత్యసన్నిహితమైన – ఎన్నడును ఎడబాయని – దూరరహితమైన వస్తువు వేరొకటి లేదు. ఉండదు.

(ఇతర విశేషణము లన్నియును వెనుక వివరింపబడెను.)

దేహము రాలిపోగా యోగి యిట్టి కేవలపరబ్రహ్మమే తానగుచున్నాడు.

శ్రీ సదాశివబ్రహ్మేంద్రులవారు (గ్రంథకర్త) ఇలాటి యోగిపుంగవులే. వారు బ్రహ్మీభూతులైనారన్నది నిశ్చితము. పరబ్రహ్మము అందరకును నిత్యసన్నిహితమని చెప్పినారు గదా! బ్రహ్మీభూతులగుటచే శ్రీసదాశివబ్రహ్మేంద్రులు అందరకును నిత్యసన్నిహితులని వేరే చెప్పనక్కరలేదు.

ఎవడైనను తీవ్రమైన అభ్యాసవైరాగ్యములచే తన అంతఃకరణమును దాటి సన్మాత్రముగ అనుభవింపబడు పరబ్రహ్మమును జేరుకొన్నచో - వారు శ్రీసదాశివబ్రహ్మేంద్రుల వారిని జేరుకొనినారన్నమాట.

శ్రీసదాశివబ్రహ్మేంద్రులవారు అందరకును నిత్యసన్నిహితులై అందరి నేనుకును వెనుక విరాజిల్లుచున్నారన్న యథార్థమును గూడ యీ శ్లోకము తెలియజేయుచున్నది.

---

**శ్లో॥ అరసమగన్ధమరూపం**
**విరజస్కమసత్త్వమతమస్కమ్ ।**
**నిరుపమనిర్భయతత్త్వం**
**తత్కిమపి ద్యోతతే నిత్యమ్ ॥** **62**

ప్ర : అరసమ్ = రసము లేనిది,
అగన్ధమ్ = వాసన లేనిది,
అరూపమ్ = ఆకారము లేనిది,
విరజస్కమ్ = రజోగుణము లేనిది,
అసత్త్వమ్ = సత్త్వగుణము లేనిది,
అతమస్కమ్ = తమోగుణము లేనిది, అగు;
తత్ = ఆ (ప్రసిద్ధమైన),
కిమపి = మాటలతో వర్ణించుటకు వీలు కాని,
నిరుపమనిర్భయతత్త్వమ్ = ఉపమానము, భయము లేని ఒక పదార్థము,
నిత్యమ్ = ఎల్లప్పుడూ,
ద్యోతతే = భాసించుచున్నది.

**తా॥** రూప రస గంధములు కాక - సత్త్వ - రజః - తమస్సులనెడు గుణములు ఏమియును లేనిదై - సాటిలేని అభయవస్తువొకటి అనిర్వచనీయమై - అద్వితీయమై ప్రకాశించుచున్నది.

**వి :** శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు శ్రోత్రాదీంద్రియములచే బట్టువడుచున్న విషయములు. పరబ్రహ్మము అట్టిది కాదు. అది ఇంద్రియవృత్తుల పట్టునకు జిక్కదు. అది 'అశబ్ద - మస్పర్శ - మరూప - మవ్యయం' అయినది.

విశ్వమంతయు త్రిగుణాత్మకము. త్రిగుణము లనగా సత్త్వరజస్తమోగుణములు.

"**త్రైగుణ్యవిషయా వేదాః నిస్త్రైగుణ్యో భవార్జున!।**" – గీత.

పరబ్రహ్మము త్రిగుణాతీతము, నిర్గుణము. గుణాతీతుడు కానివాడు దాని పొలకువను అనుభవింపనేరడు.

బ్రహ్మానుభవము 'అత్రి'కి మాత్రమే లభించును. 'అత్రి' అనగా త్రిగుణములు లేనివాడు. అతడు 'అనసూయాభావముతో' గూడినపుడు పరబ్రహ్మము సాక్షాత్కరించును.

'పరగుణేషు దోషావిష్కరణం – అసూయా' గుణమును దోషముగా జూచుట అసూయ. ఉన్నది పరబ్రహ్మము కాగా – దానిని నశ్వరమైన జగత్తుగా జూచుట – ఉన్నదొక్కటే కాగా – నానాత్వమును దర్శించుట – గుణమందు దోషదర్శనమే కదా!

కాగా, పరబ్రహ్మమునందు జగద్భావన 'అసూయ' అనబడును. అదిలేకుండుట 'అనసూయాత్వము' – అనగా బ్రహ్మమును బ్రహ్మముగా దర్శించుట.

అత్రియై ఇట్టి భావము కలవాడైనపుడు – ఆత్రేయమైనదేదో – అనగా త్రిగుణాతీతమైనది సాక్షాత్కరించును.

"**అహం బ్రహ్మేతి చేద్వేద సాక్షాత్కారః స ఉచ్యతే**" – పఞ్చదశీ.

సాక్షాత్కారమనగా తానే అది యగుట.

ఇట్టి సాధనమార్గముచే అందుకొనదగిన పరబ్రహ్మముగా శ్రీసదాశివబ్రహ్మేంద్ర సరస్వతులవారున్నారని, అభ్యాసవైరాగ్యములచే వారిని అందుకొనవచ్చునని తాత్పర్యము.

---

**శ్లో॥ ఇతి గురుకరుణాపాఙ్గా-**
**దార్యాభిః ద్వ్యధికషష్టిసంఖ్యాభిః ।**
**నిరవద్యాభిరవోచం**
**నిగమశిరస్తన్త్రసారభూతార్థమ్ ॥** **63**

ప్ర : గురు–కరుణాపాఙ్గాత్...
గురు = గురుదేవుల యొక్క,
కరుణా = దయతో కూడిన,
అపాఙ్గాత్ = కటాక్షము వలన,
ఇతి = ఈ విధముగా,
నిరవద్యాభిః = దోషము లేనటువంటి,

ద్వ్యధికషష్టిసంఖ్యాభిః = అరువది రెండు (62) సంఖ్య కల,
ఆర్యాభిః = ఆర్యా వృత్తము కల శ్లోకములతో,
నిగమశిరస్త్రసారభూతార్థమ్ = వేదాన్తశాస్త్రములోని సారభూతమైన విషయమును,
అవోచమ్ = చెప్పితిని.

**తా॥** శ్రీగురువులైన శ్రీపరమశివేన్ద్రసరస్వతుల కరుణాకటాక్షముచే నేను (సదాశివేంద్ర-సరస్వతి) ఉపనిషత్సారభూతమైన మహార్థము నీవిధముగా - అనింద్యములైన అరువది రెండు ఆర్యావృత్తములతో జెప్పితిని.

**వి :** ఉపనిషత్తుల నన్నిటిని మధింపగా లభించు సారమీ గ్రంథములో నున్నది. అనుటచే ఉపనిషత్తుల సమ్యక్పఠనముచే లభించు ప్రయోజనము అల్పకాయమైన ఈ గ్రంథము నొక్కదానిని పఠించి పొందగలరనియు, ఇది గ్రంథరత్నములకు తలమానిక మనియు తాత్పర్యము.

ఆర్యావృత్తము మాత్రాఛందము. బేసిపాదముల యందు 12 మాత్రలతో ఇది నడచును.

ఈ గ్రంథమునం దన్నియు ఆర్యావృత్తములే.

---

**శ్లో॥ గదితమిమమాత్మవిద్యా-**
**విలాసమనువాసరం స్మరన్ విబుధః ।**
**పరిణతపరాత్మవిద్యః**
**ప్రపద్యతే సపది పరమార్థమ్ ॥ 64**

ప్ర : గదితమ్ = (నాచేత) చెప్పబడిన,
ఇమమ్ = ఈ,
ఆత్మవిద్యావిలాసమ్ = ఆత్మవిద్యావిలాసము అను ఈ గ్రన్థమును,
అనువాసరమ్ = ప్రతిదినము,
స్మరన్ = స్మరించుచూ,
విబుధః= పండితుడు,
పరిణత-పరాత్మవిద్యః...
పరిణత = పక్వము చెందిన,

పరాత్మవిద్యః = పరమాత్మ విద్య కలిగిన వాడై,
సపది = వెంటనే,
పరమార్థమ్ = పరమపురుషార్థమైన మోక్షమును,
ప్రపద్యతే = పొందును.

**తా॥** ఎవడేని విద్వాంసుడీ ఆత్మవిద్యావిలాసమును ప్రతిదినము అర్థచింతనపరుడై పఠించినచో – వానియందు ఆత్మవిద్య పంటకువచ్చును. ఆత్మవిద్య పరిపక్వదశకు చేరినంతనే – నిముసమైనను ఆలస్యముండదు. పరమార్థ మాతనికి లభించును.

**వి :** విద్వాంసుడు ఈగ్రంథమును జదువుటకు అధికారి. అతడైనను దీనిని నిత్యము జదువుచుండవలయును. లేకున్న అది 'గజస్నాన మగును'.

ఏనుగు స్వచ్ఛనదీజలములో శుభ్రముగ స్నానము చేసి, ఒడ్డెక్కి వెంటనే ధూళిలో పొరలాడును. స్నానమువలన లభించిన శుభ్రత లభించినదా? లేదు.

అట్లే, ఈ గ్రంథము నొకమారు జదువగా జనించిన విషయపరాఙ్ముఖవృత్తి – ఆత్మాభిముఖప్రవృత్తి – ప్రాపంచికవిషయములచే మరల మాసిపోవును. అందుచే దీనిని నిత్యము పఠింపవలె ననినారు.

ఆ పాఠముకూడ కేవలము అక్షరోచ్చారణము కాదు, సమ్యగర్థచింతనముతో సాగవలయును. లేకున్న ప్రయోజన ముండదు.

ఈగ్రంథపఠనమునం దీ నియమములను బాటించి వర్తిల్లిన వానియం దాత్మవిద్య పంటకు వచ్చును. అతడీ పుడమిపై మరల నవతరించిన శ్రీసదాశివేన్ద్రయోగీన్ద్రుడై విరాజిల్లును.

---

**శ్లో॥ పరమశివేన్ద్రశ్రీగురు–**
**శిష్యేణేత్థం సదాశివేన్ద్రేణ ।**
**రచితేయమాత్మవిద్యా–**
**విలాసనామ్నీ కృతిః పూర్ణా ॥** **65**

ప్ర : ఇత్థమ్ = ఈ విధముగా,
పరమశివేన్ద్రశ్రీగురుశిష్యేణ = పరమశివేన్ద్రసరస్వతీ అను పేరు గల గురువు గారి యొక్క శిష్యుడైన,

సదాశివేన్ద్రేణ = సదాశివేన్ద్రసరస్వతీ అను పేరు గల నా చేత,
ఇయమ్ = ఈ,
ఆత్మవిద్యావిలాసనామ్నీ = ఆత్మవిద్యావిలాసము అను పేరు గల,
కృతిః = కృతి (గ్రన్థము),
పూర్ణా = సంపూర్ణమైనది.

**తా॥** శ్రీపరమశివేంద్రసరస్వతుల శిష్యుడు సదాశివేంద్రుడు ఈ విధముగా రచించిన '**ఆత్మవిద్యావిలాసము**' అన్న గ్రంథము సమాప్తమైనది. పూర్ణమైనది.

**వి :** "సంసారమన్న సుడిగుండమున జిక్కి ఉక్కిరి బిక్కిరి యగుచున్న ఓ లోకమా! నీ దుఃఖములెల్ల దొలగుటకు, నీ వపారానందవారాశిలో నోలలాడుటకు తగిన మార్గము జెప్పితిని. నా చెప్పుట పూర్ణమైనది.

'**ఈ మార్గమును అనుసరించి శ్రేయమొందుట నీవంతు. నీవంతు పని వెంటనే ఆరంభింపుము**' అని ఉపదేశము.

పరమహంస పరివ్రాజకాచార్యులు
శ్రీపరమశివేంద్ర పూజ్యపాదుల శిష్యులు
అయిన, శ్రీసదాశివబ్రహ్మేంద్రులు
రచించిన ఆత్మవిద్యావిలాసము
సంపూర్ణము.

శ్రీః